ఓమ్.

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే
ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమోనమః.

# శ్రీవిచారచంద్రోదయము.

బ్రహ్మవిద్యారంభమునకు నుపయుక్తమైన
షోడశకలాత్మకగ్రంథము.

శ్రీపీతాంబరపండితకృత హిందుస్థానిమూలగ్రంథమునకు
ఆంధ్రభాషలో భాషాంతరీకరణము
జనార్దనస్వామిచైతన్యునిచే జేయఁబడినది
ఆవృత్తి మొదటిది.

శాలివాహనశకము 1830 కీలకనామసంవత్సర మాఘశుద్ధపక్షము.

రెండవ ముద్రణము

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

చన్నపురి.

1926.

# శుద్ధాశుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 6 | సదా | షదా. 1 |
| 15 | 24 | ఘటద్రష్టన్యాయ | ఘటద్రష్టృన్యాయ |
| 28 | 18 | వానికి ద్రష్టృ, | వానికి ద్రష్ట, |
| 35 | 8 | లఘు విష | లఘు అవిష |
| 64 | 12 | బ్రహ్మత్మ | బ్రహ్మత్మ |
| 67 | 8 | అభ్యాసములచే | అభ్యాసబలముచే |
| ,, | 9 | సర్వథా కలితము | సర్వథా గళితము |
| 70 | 17 | నిశ్చయజ్ఞాన | నిశ్చయము జ్ఞాన |
| ,, | 20 | ముముక్షుశ్రవ | ముముక్షు, శ్రవ |
| 72 | 3 | న్యము కాచ్చా | న్యమున కాచ్చా |
| ,, | 22 | యే దేశమందు | యొకదేశమందు |

ఓ మ్.

# శ్రీ విచారచంద్రోదయము.

## ప్రథమ కల.

శ్లోకమ్. సంసారమత్తమాతంగ గండదారణ కేసరిణే ।
శ్రీవాసుదేవ చైతన్య! మంగలం కురు మే సదా.

### ఉపోద్ఘాత వర్ణనము.

ప్రశ్న.—పురుషార్థ మనఁగా నేమి?

ఉత్తర.—సర్వపురుషులయిచ్ఛయొక్క విషయము పురుషార్థము 2.

ప్ర.—సర్వపురుషులకు యెట్టి యిచ్ఛ కలుగును?

ఉ.—సర్వపురుషులకు సమస్తదుఃఖములయొక్క నివృత్తికొఱకును, పరమానందప్రాప్తికొఱకును యిచ్ఛ కలుగును.

ప్ర.—సమస్తదుఃఖములకు నివృత్తి, పరమానందప్రాప్తి ఇవి యెవ్వి?

ఉ.—సమస్తదుఃఖములకు నివృత్తి 3, మఱియు పరమానంద ప్రాప్తి 4, ఇవి మోక్షస్వరూపము.

ప్ర.—మోక్షము దేనివలనఁ గలుగును?

ఉ.—మోక్షము 5, బ్రహ్మజ్ఞానమువలనఁ గలుగును 6.

ప్ర.—బ్రహ్మజ్ఞాన మనఁగా నేమి?

ఉ.—ఇది బ్రహ్మస్వరూపము, అని యథార్థముగాఁ దెలిసికొనుట.

ప్ర.—బ్రహ్మజ్ఞాన మెన్నిప్రకారములు గలది?

ఉ.—బ్రహ్మజ్ఞానము పరోక్షము, అపరోక్షము అని ద్వివిధము.

ప్ర.—పరోక్షబ్రహ్మజ్ఞాన మెద్ది?

ఉ.—బ్రహ్మము సచ్చిదానందరూపముగ నున్న దని యెఱుఁగుట.

ప్ర.—పరోక్షబ్రహ్మజ్ఞానము ఏ హేతువువలన నగును?

ఉ.—సద్గురువు, మఱియు సచ్ఛాస్త్రము, తద్వచనముమీఁద విశ్వాస ముంచుటచే పరోక్షబ్రహ్మజ్ఞాన మగును.

ప్ర.—పరోక్షబ్రహ్మజ్ఞానముచేత నేమి యగును?

ఉ.—అసత్త్వాపాదకావరణము 7 యొక్క నివృత్తి యగును.

ప్ర.—పరోక్షజ్ఞానము ఎపుడు పూర్ణ మగును?

ఉ.—పరోక్షజ్ఞానము బ్రహ్మనిష్ఠగురువు, వేదాంతశాస్త్రము, వీని కనుసారముగ బ్రహ్మస్వరూపనిర్ధారణము చేసినపుడు పూర్ణ మగును.

ప్ర.—అపరోక్షబ్రహ్మజ్ఞాన మేది?

ఉ.—సచ్చిదానందబ్రహ్మము నే నని యెఱుఁగుట అపరోక్షబ్రహ్మజ్ఞానము.

ప్ర.—అపరోక్షబ్రహ్మజ్ఞానము ఏ హేతువువలన నగును?

ఉ.—గురుముఖద్వారమున తత్త్వమస్యాదిమహావాక్యముల యొక్క శ్రవణమువలన అపరోక్షబ్రహ్మజ్ఞాన మగును.

ప్ర.—అపరోక్షబ్రహ్మజ్ఞానము ఎన్నివిధములు?

ఉ.—అపరోక్షబ్రహ్మజ్ఞానము అదృఢదృఢ భేదముచే ద్వివిధము.

ప్ర.—అదృఢాపరోక్షబ్రహ్మజ్ఞాన మేది?

ఉ.—అసంభావనా విపరీతభావనా 8 సహితముగ బ్రహ్మాత్మల యేకతానిశ్చయము, అదృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము.

ప్ర.—అదృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము ఏ హేతువువలన నగును?

ఉ.—క్రొంచెము మలవిక్షేపదోషము లుండఁగా శ్రుత మైన నానా
నము, బ్రహ్మమందు అద్వైతాసంభవజ్ఞానము, భేదవాదిపామర
షులసంగతియొక్క సంస్కారము వీనితోఁగూడిన పురుషునికి గురు
ద్వారమున మహావాక్యశ్రవణముచే అదృఢాపరోక్షజ్ఞానమగును.

ప.—అదృఢాపరోక్షజ్ఞానముచే ఏఫలము ప్రాప్త మగును?

ఉ.—అదృఢాపరోక్షజ్ఞానముచే ఉత్తమలోకము ప్రాప్తమై, పవిత్ర
త్కులమందు, లేక జ్ఞానపురుషునికులమందు జన్మ మగును.

ప్ర.—అదృఢాపరోక్షజ్ఞానము ఎపుడు పూర్ణ మగును?

ఉ.—బ్రహ్మనిష్ఠ మైన సచ్చిదానందాదిలక్షణములయొక్క అవ
జ్ఞానమైనను, సంశయ 9 విపర్యయములయొక్క సద్భావ మై
డు అదృఢాపరోక్షజ్ఞానము పూర్ణ మగును.

ప్ర.—దృఢాపరోక్షబ్రహ్మజ్ఞాన మేది?

ఉ.—అసంభావనా విపరీతభావనారహిత మగు బ్రహ్మాత్మైక్యనిశ్చ
యు దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము.

ప్ర.—దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము ఏహేతువువలన నగును?

ఉ.—గురుముఖముచే ప్రాప్త మైన మహావాక్యార్థము 10 యొక్క
ణమనననిదిధ్యాసనములచే దృఢాపరోక్షబ్రహ్మజ్ఞాన మగును.

ప్ర.—దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానమునకు ఫల మేమి?

ఉ.—అభానాపాదకావరణము 11 మఱియు విక్షేప 12 సహితా
ము వీనియొక్క నివృత్తియై బ్రహ్మప్రాప్తిరూపమోక్షము.

ప్ర.—దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము ఎపుడు పూర్ణ మగును?

ఉ.—దేహమందు అహంతాజ్ఞానమువలె అజ్ఞానముయొక్క బాధము
, బ్రహ్మాభిన్నాత్మయందు అహంతాజ్ఞానము యెపు డగునో అపుడు.

ప్ర.—ఆత్మానాత్మవిచార మనన దేమి?

ఉ.—ఆత్మను, మఱియు అనాత్మను వేఱువేఱుగా యెఱుఁగుట.

ప్ర.—ఈ విచారము ఏ హేతువువలన నగును?

ఉ.—ఈశ్వర వేదగురువులు, మఱియు స్వాంతఃకరణము, ఈ నలుగురియొక్క కృపవలన ఈ విచార మగును 13.

ప్ర.—ఈ విచారమునకు ఫల మేమి?

ఉ.—ఈ విచారముచే దృఢాపరోక్షబ్రహ్మజ్ఞాన మగుచున్నది.

ప్ర.—ఈ విచారము యెపుడు పూర్ణ మగును ?

ఉ.—ఈ విచారము దృఢాపరోక్షజ్ఞాన మైనపుడు పూర్ణ మగును.

ప్ర.—దేనియొక్క విచారము చేయవలయును?

ఉ.—నే నెవ్వఁడు? బ్రహ్మ మేది? ప్రపంచ మేది? ఈ మూఁడు వస్తువులయొక్క విచారము చేయవలయును.

ప్ర.—యీ మూఁడువస్తువులయొక్క సాధారణరూపము లేవి ?

ఉ.—నేను బ్రహ్మము ఇవి చైతన్యము, ప్రపంచము జడము 14.

ప్ర.—చైతన్య మనున దేమి ?

ఉ.—ఏది జ్ఞానరూపమై ఘటపటాదిప్రపంచమును యెఱుఁగుచున్నదో, మఱియు దేని నెఱుఁగుటకు మన యింద్రియాదులందు ఏదియు సామర్థ్యము కాదో, అది చైతన్యము.

ప్ర.—జడ మనున దేమి ?

ఉ.—ఏది తన్నెఱుఁగదో, ఇతరులను యెఱుఁగదో, ఇట్టి యజ్ఞాన 15, మఱియు తత్కార్య మైన భూతభౌతిక 16 ప్రపంచము జడము.

ప్ర.—పైఁ జెప్పఁబడిన మూఁడువస్తువుల విచారముయొక్క ఉపరాగము యేరీతిగా నగును?

ఉ.—తత్త్వమసి మహావాక్యమందు స్థిత మైన త్వంపదము, తత్పము, వానియొక్క వాచ్యార్థము లైన జీవుఁడు, ఈశ్వరుఁడు, వానిలో

వారియొక్క ఉపాధిరూపమైన యేప్రపంచము గలదో, దానిని రజ్జువునందు సర్పన్యాయముగ, స్థాణువునందుపురుషన్యాయముగ, మరుభూమియందు మృగజలన్యాయముగ యెఱుఁగుట ప్రపంచవిచారముయొక్క ఉపయోగ మగును; నేను త్వంపదలక్ష్యార్థ మైనఆత్మ, ఆ నేనే తత్పదలక్ష్యార్థ మగు బ్రహ్మము; ఈరీతిగా బ్రహ్మాత్మైక్యమును యెఱుఁగుట నే నెవఁడు, బ్రహ్మ మేది, ఈ విచారముయొక్క ఉపయోగ మగును.

ప్ర.—ఈ విచారాధికారి యెవఁడు? వాఁడు యేమి చేయుచున్నాఁడు?

ఉ.—ఈ విచారమునకు అధికారి ఉత్తమజిజ్ఞాసువు 17 వాఁడు సద్గురుకృపవలన ఉపోద్ఘాతాదిప్రక్రియలను విచారించి, నేనే బ్రహ్మముగా నున్నా నని బ్రహ్మాత్మను అపరోక్షముగా యెఱుఁగుచున్నాఁడు.

ప్ర.—ఆ ప్రక్రియలయొక్క 18 నామము లేవి?

ఉ.—1 ఉపోద్ఘాతము 2 ప్రపంచారోపాపవాదము 3 దేహత్రయములకు ద్రష్ట నేను 4 నేను పంచకోశాతీతుఁడు 5 అవస్థాత్రయములకు సాక్షి నేను 6 ప్రపంచమిథ్యాత్వము 7 ఆత్మవిశేషణములు 8 సచ్చిదానందవిశేషవర్ణనము 9 అనిర్వాచ్యసిద్ధాంతవర్ణనము 10 సామాన్యచైతన్యము విశేషచైతన్యము 11 త్వంపదతత్పదములవాచ్యార్థలక్ష్యార్థవిచారము 12 జ్ఞానికర్మనివృత్తి 13 సప్తజ్ఞానభూమికలు 14 జీవన్ముక్తి విదేహముక్తి 15 వేదాంతప్రమేయము ఇవి తన్నామములు.

---

టిప్పణము.

1. ప్రతిపాదించుటకు యోగ్యమైన అర్థమును మనస్సులోనుంచి తదర్థముకొఱకు అన్యార్థప్రతిపాదనము ఉపోద్ఘాతము; యెట్లనఁగా— మజ్జిగకొఱకు వచ్చుట ఆవుసమాచారము నడుగుట.

2. ధర్మార్థకామమోక్షము లగు నాలుగుపురుషార్థములలో శ్రేష్ఠ మైన మోక్షపురుషార్థమునకు ఇచ్చట గ్రహణము.

3. మిథ్యాత్వనిశ్చయము అత్యంతనివృత్తి యనఁబడును.

4. పరమప్రేమమునకు విషయము పరమానంద మనఁబడును.

5. కర్తృత్వభోక్తృత్వాదు లైన అన్యథాభావమును విడిచి స్వస్వరూపముచే స్థితియే మోక్షము. స్వర్గ వైకుంఠ గోలోక బ్రహ్మలోకాదులప్రాప్తిని కొందఱు మోక్ష మనుచున్నారు.

6. బ్రహ్మాభిన్న మగు ఆత్మ యొక్క జ్ఞానము మోక్షహేతువు.

7. బ్రహ్మము లేదు; ఈరీతిగా బ్రహ్మసద్భావమునకు సంపాదక మైన ఆవరణము.

8. అసంభావనావిపరీతభావనాలక్షణములు శ్రీ విచారసాగర మందు వివరముగ వ్రాయఁబడినవి.

9. ద్వికోటికజ్ఞానమును సంశయ మందురు.

10. జీవబ్రహ్మలఏకతాబోధకవాక్యము మహావాక్యము.

11. బ్రహ్మము భాసిల్లదు; ఈరీతిగా బ్రహ్మప్రతీతి సంపాదక మైన ఆవరణము.

12. స్థూలసూక్ష్మశరీరసహిత మగు చిదాభాసము, మఱియు తద్ధర్మము లైన కర్తృత్వభోక్తృత్వజననమరణాదులును విక్షేప మనఁబడును.

13. సద్గురువు మొదలగు జ్ఞానసామగ్రియొక్క ప్రాప్తి ఈశ్వర కృప, శాస్త్రార్థధారణశక్తి వేదకృప, శాస్త్రానుసారముగ స్వానుభవానుసారముగ యథార్థోపదేశము చేయుట గురుకృప, శాస్త్రగురు వచనానుసారముగ సాధనములను సంపాదించుట స్వాంతఃకరణకృప.

14. సమష్టివ్యష్టిస్థూలసూక్ష్మకారణదేహములు, వానిఅవస్థలు, వానిధర్మములు ప్రపంచ మనఁబడును.

15. "నేను యెఱుఁగను" అను వ్యవహారమునకు హేతువైన ఆవరణవిక్షేపశక్తి గల అనాదిభావరూపపదార్థము.

16. భూతకార్యమైన పిండబ్రహ్మాండాది భౌతిక మనఁబడును.

17. వివేకాదిసాధనసంపన్నుఁడయి, కుతర్కరహితుఁడైన అధికారి ఉత్తమజిజ్ఞాసువు.

18. బోధ చేయు ప్రకారము.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - ఉపోద్ఘాతవర్ణననామికా
ప్రథమకలా సంపూర్ణా.



# ద్వితీయకల

## ప్రపంచారోపవాదము.

ప్ర.—శుద్ధబ్రహ్మంబునందు ప్రపంచారోపము ఏరీతిగాఁ గలుగును?

ఉ.—అనాదియైన శుద్ధబ్రహ్మంబునందు అనాది 1 కల్పిత ప్రకృతి గలదు; ఆ ప్రకృతికి బ్రహ్మముతో తాదాత్మ్యసంబంధము గలదు. [కల్పితభేదసహితవాస్తవాభేదమును తాదాత్మ్యసంబంధ మందురు].

ఆప్రకృతి, మాయా ఉవిద్యాతమఃప్రధానరూపకములచేత విభాగ మును పొందుచున్నది; వానిలో శుద్ధసత్త్వగుణప్రధానమైనది 2 మాయయనఁబడును, మలినసత్త్వగుణప్రధానమైనది 3 అవిద్య యనఁబడును, తమోగుణ మధికముగాఁగలది తమఃప్రధానప్రకృతి యనఁబడును.

మాయ 4 దానియందు బ్రహ్మప్రతిబింబము, మఱియు బింబమైనబ్రహ్మము చేరి, జగత్కర్త సర్వజ్ఞుఁ డగు ఈశ్వరుఁ డనఁబడును.

అవిద్య, మఱియు దానియందు బ్రహ్మప్రతిబింబము, మఱియు బింబ మైన బ్రహ్మము మూఁడు చేరి, కర్త, భోక్త, అల్పజ్ఞుఁ డగు జీవుఁ డనఁబడును [ఈ స్థానమందు బింబ మైన బ్రహ్మంబు అవిద్యోపహిత చైతన్యము, లేక కూటస్థుఁ డనఁబడును].

ఈశ్వరుఁడు, మఱియు జీవుఁడు, ఇద్దఱును అనాదికల్పితులుగా నున్నారు; వానిలో ఈశ్వరోపాధి యైన మాయ యొకటిగ నుండుటవలనను, అపేక్షికవ్యాపకముగ నుండుటవలనను ఈశ్వరుఁడు ఒకఁడుగాను, అపేక్షికవ్యాపకుఁడుగాను 5 ఉన్నాఁడు; జీవోపాధి యైన అవిద్య నానావిధములుగా నుండుటవలనను, పరిచ్ఛిన్నముగ నుండుటవలనను జీవులు అనేకులుగాను, పరిచ్ఛిన్నులుగాను ఉన్నారు.

ఆ జీవేశ్వరులకు అనాదికల్పితభేదము గలదు. సృష్టికి పూర్వము జీవోపాధి యైన అవిద్య జీవకర్మసహితముగ మాయయందు లీనమగుచున్నది. ఆ మాయ సుషుప్తియందుండు అవిద్యవలె బ్రహ్మముకన్న భిన్నముగ ప్రతీతము గాదు; కావున సృష్టికి మునుపు సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత మగు ఒకటే అద్వితీయసచ్చిదానందరూపమయినట్టి బ్రహ్మము గలదు.

ఆ బ్రహ్మమునకు సృష్ట్యారంభమందు పరిపక్వ మైన జీవులకర్మరూ

పనిమిత్తముచే ఒకఁడైన నేను బహురూపము గావలయు నని ఇచ్ఛ పుట్టెను;

తదిచ్ఛాయోగముచే మాయయందు క్షోభము గలిగి ఆకాశ వాయుతేజోజలపృథ్వు లని పంచమహాభూతములు క్రమముగా పుట్టినవి.

ఆ భూతములయొక్క పంచీకరణ మవుటకు పూర్వమందు వానిచే సమష్టివ్యష్టిసూక్ష్మసృష్టియై, పిదప ఈశ్వరేచ్ఛవలన వానియొక్క పంచీకరణమై, దానివలన సమష్టివ్యష్టిరూపస్థూలసృష్టి పుట్టుచున్నది.

దానిలో—సమష్టి స్థూలసూక్ష్మకారణ ప్రపంచములయొక్క అభిమాని జీవదృష్టిచే ఈశ్వరుఁడు, మఱియు వ్యష్టిస్థూలసూక్ష్మకారణప్రపంచములయొక్క అభిమాని జీవుఁడు; వానిలో—ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁ డగుటవలన నిత్యముక్తుఁడు గాను, జీవుఁడు అల్పజ్ఞుఁ డగుటవలన బద్ధుఁడుగాను ఉన్నాఁడు.

ఈప్రకారముగ శుద్ధబ్రహ్మమందు ప్రపంచారోప మగుచున్నది.

ప్ర.—ఈ యారోపము సత్యమా? మిథ్యయా?

ఉ—రజ్జువందు సర్పన్యాయమున, సాక్షియందు స్వప్నన్యాయమున, దర్పణమందు ప్రతిబింబన్యాయమున మిథ్యగా నున్నది.

ప్ర.—ఈ యారోపము దేనివలన కలుగుచున్నది?

ఉ.—ఈ యారోపము అజ్ఞానమువలన కలుగుచున్నది.

ప్ర.—ఈ యారోపము ఎపుడుపుట్టెను? ఎందుకు పుట్టవలెను?

ఉ.—వస్త్రమునందు ముఱికిపడినపుడు కడుగవలెను గాని ఇది నెపుడు పడుచున్న దని, ఎందుకు పడుచున్న దని అడుగుటచే ప్రయోజనము లేదు; అట్లు ఈ ప్రపంచారోపము ఎపుడు ఎందుకని పూర్వపక్ష ప్రయోజనము లేదు; తన్నివృత్త్యుపాయము చేయుట ఉచితము.

ప్ర.—ఈ యన్ని ఆరోపములనివృత్తి యేరీతిగా నగును?

ఉ.—బ్రహ్మజ్ఞానమువలన మాయకును అవిద్యకును నివృత్తియై, దానివలన కార్యసహితప్రకృతికి, దానివలన ప్రకృతిబ్రహ్మసంబంధము నకును, దానివలన జీవభావేశ్వరభావములకును, దానివలన జీవేశ్వర భేదమునకును నివృత్తియై, దానివలన బంధనివృత్తియై, మోక్షము సిద్ధ మగును; ఈవిధముగా ఏకకాలమందే సర్వారోపనివృత్తిరూపాప వాద మగుచున్నది 6.

ప్ర.—బ్రహ్మజ్ఞానము దేనివలన నగును ?

ఉ.—బ్రహ్మజ్ఞానము ముందు చెప్పఁబోవు విచారమువలన నగును.

---

టి ప్ప ణ ము.

1. ఉత్పత్తిరహితవస్తువు స్వరూపముచే అనాది యనఁబడును; అటువంటివి బ్రహ్మము, ఈశ్వరుఁడు, జీవుఁడు, అవిద్య, భేదము, సంబంధము ఈ యాఱు యనాది యనఁబడును; మఱియు ప్రపంచము ప్రవాహరూపముచే అనాదిగానే యున్నది.

2. క్షత్త్రియ శూద్రు లైన ఇద్దఱిమంత్రులను దమించి యుండు ఒకబ్రాహ్మణరాజువలె రజస్తమములను దమించియుండు సత్త్వగుణ ము శుద్ధసత్త్వగుణ మనఁబడియె.

3. శూద్రు లైన ఇద్దఱి రాజపుత్త్రులచే దమింపఁబడిన ఒక బ్రాహ్మణమంత్రివలె రజస్తమములచే దమింపఁబడిన సత్త్వగుణము మలిన సత్త్వగుణ మనఁబడును.

4. ఇచ్చట మాయాశబ్దముచే మాయ, మఱియు తమఃప్రధాన ప్రకృతి ఈ రెండు ఈశ్వరోపాధులయొక్క గ్రహణము గలదు; మాయాంగీకారముచే ఈశ్వరుఁడు కులాలునివలె జగత్తునకు నిమిత్తకారణ

ముగాను, తమఃప్రధానప్రకృత్యంగీకారముచే మృత్తికవలె జగత్తునకు ఉపాదానకారణముగాను ఉన్నాఁడు.

5. ఒకనియొక్క యపేక్షచే వ్యాపకమై, ఇంకొక్కనియొక్క యపేక్షచే పరిచ్ఛిన్న మయినది ఆపేక్షిక వ్యాపక మనఁబడును.

6. సర్పమునకును తదజ్ఞానమునకును బాధమై, రజ్జురూపాధిష్ఠానావశేషమువలె ప్రపంచమునకును తదజ్ఞానమునకును బాధమై, అధిష్ఠానరూపశుద్ధబ్రహ్మము అవశేషముగాఁ జేయుట అపవాదము.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - ప్రపంచారోపాపవాదవర్ణననామికా ద్వితీయకలా సంపూర్ణా.



# తృతీయకల

## దేహత్రయముల యొక్క ద్రష్ట నేను.

---

ప్ర.—దేహత్రయద్రష్ట నే ననుటకు ఆ మూఁడు దేహములు ఏవి ?

ఉ.—స్థూలసూక్ష్మకారణములు ఈ మూఁడు దేహములు.

ప్ర.—స్థూల దేహము ఎట్లున్నది?

ఉ.—పంచీకృత పంచమహాభూత పంచవింశతితత్త్వములరూపము.

ప్ర.—పంచమహాభూతములు ఏవేవి?

ఉ.—ఆకాశ వాయు తేజోజలపృథ్వ్యులు ఇవి పంచమహాభూతములు.

ప్ర.—పంచమహాభూతములయొక్క ఇరువదైదుతత్త్వము లేవేవి?

ఉ.—ఆకాశతత్త్వపంచకము—కామక్రోధశోక మోహాభయములు.

వాయుతత్త్వపంచకము—చలనవలన ధావనప్రసారణాకుంచనములు.

తేజస్తత్త్వపంచకము—క్షుధాతృషాలస్యనిద్రాకాంతులు.

జలతత్త్వపంచకము—శుక్రశోణితలాలా మూత్రస్వేదములు.

పృథ్వీతత్త్వపంచకము—అస్థిమాంసనాడీత్వగ్రోమములు.

ప్ర.—పంచీకృతభూత మనఁగా నేమి?

ఉ.—దేనియొక్క పంచీకరణ మైనదో, అది పంచీకృతభూతము.

ప్ర.—పంచీకరణ మనున దేమి?

ఉ.—పంచభూతములందు ఒక్కొకభూతమును రెండురెండుభాగములు చేసి, మొదటిది యైదుభాగములు తనస్థలముమీఁద నుంచి, రెండవదైన ఐదుభాగములందు ఒక్కొక్కభాగమును నాలుగునాలుగు భాగములు చేసి, వానిలో నొక్కొక్కభాగము తనకన్న ఇతరభూత భాగములందు చేర్చుటకు పేరు పంచీకరణము.

ప్ర.—ఐదుభూతములయొక్క పరస్పరమిశ్రణము ఎట్లు గలుగును?

ఉ.—ఐదుగురు మిత్రులు వేఱువేఱుప్రకారము గల పండ్లు తెచ్చి, ఒక్కొకడును తినుటకు పూర్వమందు తనపండ్లలో అర్ధమర్ధముపండ్లు తనకొఱకు నుంచి, మిగతపండ్లలో నాలుగునాలుగుభాగములు చేసి,

నాలుగుమిత్రులకును ఒక్కొక్కభాగ మిచ్చుటచే వండ్లయొక్కమిశ్రణము ఎట్లు గలుగునో, అట్లు భూతములమిశ్రణము ఎఱుఁగవలయును.

ప్ర.—పంచమహాభూతములకు ఇరువదైదుతత్త్వములు ఏరీతిగ ?

ఉ.—అన్ని భూతములందు తమతమయొక్క ఒక్కొక్కముఖ్యభాగము గలదు; మఱియు, అముఖ్యము లైన నాలుగుభాగములు అన్యభూతము లవి వచ్చినవి; ఈరీతిగా ఒక్కొక్కభూతములందు ఐదైదు తత్త్వములు గలుగుటవలన అన్ని చేరి ఇరువదైదుతత్త్వములు.

ప్ర.—స్థూలదేహమందు ఈతత్త్వములు ఎట్లు వర్తించుచున్నవి ?

ఉ.—కామక్రోధశోకమోహభయము లైన ఆకాశతత్త్వపంచకమందు కామము, ఆకాశమందు వాయుభాగము చేరుటచే నగును; ఎందు కనఁగా—కామనారూపవృత్తి చంచలము, వాయువును చంచలము.

క్రోధము—ఆకాశమందు తేజోభాగము చేరుటచే నగును; ఎందు కనఁగా, క్రోధముచే శరీరము తప్తమగును, తేజస్సును తపనశక్తిగలది.

శోకము—ఆకాశముయొక్క ముఖ్యభాగము; ఎందు కనఁగా, శోకమైనపుడు శరీరము శూన్యమువలె, ఆకాశమును శూన్యమువంటిది

మోహము—ఆకాశమందు జలభాగము చేరుటచే నగును; ఎందు కనఁగా, పుత్రాదులందు మోహముపుట్టిన జలబిందువు ప్రసరించును.

భయము—ఆకాశమందు పృథ్వీభాగము చేరుటచే నగును; ఎందు కనఁగా, భయమైనపుడు శరీరము జడమగును; పృథ్వియును జడము.

చలనవలన ధావనప్రసారణము లైన వాయుతత్త్వపంచకమందు.—

చలనము—వాయువందు జలభాగము చేరుటచే నగును; ఎందు కనఁగా, జలము చంచలము.

వలనము—వాయువునందు తేజోభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, తేజస్సునందు ఎండించుధర్మము గలదు.

ధావనము—వాయువుయొక్క ముఖ్యభాగము; ఎందుకనఁగా, వాయువు పరుగెత్తుచున్నది.

ప్రసారణము—వాయువందు ఆకాశభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, ఆకాశము ప్రసృతము.

ఆకుంచనము—వాయువందు పృథ్వీభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, పృథ్వి ఆకుంచితము.

క్షుధాతృషాలస్యనిద్రాకాంతు లైన తేజస్తత్త్వపంచకమందు.—

క్షుధ—తేజస్సుయొక్క ముఖ్యభాగము; ఎందుకనఁగా, క్షుధ యైనపుడు భక్ష్యాన్నము భస్మమగును, అగ్నియందును భస్మమగును.

తృష—తేజస్సునందు వాయుభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, తృషచే కంఠము శోషించును, వాయువుచేత గుడ్డయెండును.

ఆలస్యము—తేజస్సునందు పృథ్వీభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, ఆలస్యముచే శరీరము జడము, పృథ్వియును జడము.

నిద్ర—తేజస్సునందు ఆకాశభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, నిద్రచే శరీరము శూన్యము, ఆకాశమును శూన్యము.

కాంతి—తేజస్సునందు జలభాగముచేరుటచే నగును; ఎందుకనఁగా, ఎండచే కాంతియు న్యూనమగును, జలమును న్యూనమగును.

శుక్రశోణితలాలామూత్రస్వేదములైన జలతత్త్వపంచకమందు.—

శుక్రము—జలముయొక్క ముఖ్యభాగము; ఎందుకనఁగా, శుక్రము శ్వేతము గర్భహేతువు, జలమును శ్వేతము వృక్షహేతువు.

శోణితము—జలమందు పృథ్వీభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, శోణితము ఆరక్తము, పృథ్వియును ఒక్కొక్కచోట ఆరక్తము.

లాల—జలమందు ఆకాశభాగము చేరుటచే నగును; ఎందుక నఁగా, లాలఉచ్చనీచము, ఆకాశమును స్థూలదృష్టికి ఉచ్చనీచము.

మూత్రము—జలమునందు తేజోభాగము చేరుటచేత నగును; ఎందుకనఁగా, మూత్రమును ఉష్ణము, తేజస్సును ఉష్ణము.

స్వేదము—జలమందు వాయుభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, స్వేదము శ్రమముచే, వాయువును వ్యజనశ్రమముచే.

అస్థిమాంసనాడీత్వచారోమములైన పృథ్వీతత్త్వపంచకమందు.—

అస్థి—పృథ్వియొక్క ముఖ్యభాగము; ఎందుకనఁగా, అస్థి కఠోరము పీతవర్ణము, పృథ్వియును కఠోరమై ఒకానొకచోట పీతవర్ణము.

మాంసము—పృథ్వియందు జలభాగము చేరుటచేత నగును; ఎందుకనఁగా, మాంసము జలమువలె తడిగా నున్నది.

నాడి—పృథ్వియందు తేజోభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, నాడిచే తాపపరీక్ష యగును, తేజస్సును తాపరూపము.

త్వచ—పృథ్వియందు వాయుభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, త్వచచే శీతోష్ణాదిస్పర్శము తెలియఁబడును, వాయువును స్పర్శగుణము గలదిగా నున్నది.

రోమము—పృథ్వియందు ఆకాశభాగము చేరుటచే నగును; ఎందుకనఁగా, రోమము కత్తిరించిన పీడగాదు; కనుక శూన్యరూపము, ఆకాశమును స్థూలదృష్టిచే శూన్యరూపము.

ఈరీతిగా స్థూలశరీరమందు ఇరువదైదుతత్త్వములు వర్తించును.—

ప్ర.—ఇరువదైదుతత్త్వములు ఎఱుఁగుటయందు ప్రయోజనమేమి?

ఉ.—అవి పంచీకృతపంచమహాభూతము, నేను వానిని ఎఱిఁగినవాఁడైనద్రష్ట ఘటద్రష్టన్యాయమున వానికన్న వేఱుగా నున్నాను; ఇట్లు నిశ్చయము చేయుట ప్రయోజనము.

ప్ర.—ఇరువదైదుతత్త్వములు నేను కాననియు, నావి కావనియు, ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—ఆకాశాదిభూతములందు కామక్రోధాదులు 1 పుట్టినపుడు నేను ఎఱుఁగుచున్నాను; ఎపుడు పుట్టవో, అపుడు వానియొక్క అభావమును నేను ఎఱుఁగుచున్నాను; అందువలన ఇవి నేను కాను, ఇవి నావి కావు, ఇవి ఆకాశాదులవిగా నున్నవి; నేను వీనిని ఎఱిఁగినవాఁడైనద్రష్ట ఘటద్రష్టృన్యాయమున వీనికన్న వే అని ఎఱుఁగవలెను.

ప్ర.—నేను కాను, నావికావని యెఱుఁగుటచే ఏది నిశ్చయము?

ఉ.—స్థూలదేహము, మఱియు తద్ధర్మములైన నామజాత్యాశ్రమ వర్ణసంబంధపరిమాణజన్మమరణములు మొదలైనవి నేను కాను, అవి నావి కావని నిశ్చయము కలుగును.

ప్ర.—నామాదులు నేను కాను, నావికావని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—జన్మముకన్న మునుపు నామము లేదు; జన్మానంతరము కల్పితముగ నున్నది; మఱియు శరీరాంతర్గతభిన్నభిన్నావయవముల యొక్క విచారము చేసినపుడు నామమున కాశ్రయము ఏయవయవమును కనఁబడదు. అట్లు బ్రాహ్మణాదిజాతి స్థూలదేహముయొక్క ధర్మము; సూక్ష్మదేహముయొక్కయు, ఆత్మయొక్కయు ధర్మము కాదు; ఏలాగున ననఁగా, పూర్వదేహమందుండు సూక్ష్మదేహము, మఱియు ఆత్మ ఇవిరెండును వర్తమానదేహమందును, భావిదేహమందును వర్తించును; జాతిమాత్రము వే ఆగును. అట్లు బ్రహ్మచర్యాది నాలుగుఆశ్రమములు భిన్నభిన్నకర్మములు చేయించుటకొఱకు స్థూలదేహమందు అంగీకరింపఁబడినవి; అవి మనుష్యమాత్రమందును సం

భవింపవు. అట్లు గౌరశ్యామరక్తపీతాదు లైన రంగులు స్థూలదేహ మందు ప్రత్యక్షముగ కనఁబడుచున్నవి. అట్లు పితృపుత్త్రగురుశిష్యస్త్రీపురుషస్వామిసేవకత్వాదులు మొదలుకొని స్థూలదేహములకు పరస్పర సంబంధములు కల్పింపఁబడినవి. అట్లు పొడుగు లావు మొదలుకొని ఆకారములు స్థూలదేహమందే కనఁబడు చున్నవి. ఎందువలన నేను స్థూలదేహము కానో, అందువలన పైఁ జెప్పఁబడిన నామజాత్యాదు లైన స్థూలదేహధర్మములు నేను కాను, అవి నావి కావు; వాని నెఱిఁగినవాఁ డైన ద్రష్ట నేను ఘటద్రష్టృన్యాయమున వానికన్న వేఱు.

ప్ర.—జన్మమృత్యువులు గలవాఁడు నేను కాను, అవి నాకు కలుగవు; అని ఎట్లు ఎఱుఁగవలెను ?

ఉ.—ఆత్మకు జన్మ మంగీకరించినపుడు ఆత్మ అనిత్య మగును; అవార్త మీమాంసకులు మొదలయిన పరలోకవాదు లగు ఆస్తికులకు ఇష్టము కాదు; ఎందు కనఁగా, ఆత్మ కుత్పత్తి గలిగినపుడు నాశము గలుగును; దానివలన పూర్వజన్మమందు సుకృతదుష్కృతములు చేయుచుండినను, ఇపుడు సుఖదుఃఖములభోగము, మఱియు ఈ జన్మమందు చేసినకర్మమునకు భోగము లేకయే నాశము, ఈ ద్వివిధదోషములు గలుగును; అందువలన కర్మవాదిమతమందు ఆత్మ కర్త భోక్త యని యంగీకరించినను, జన్మమృత్యురహితముగానే యంగీకరింతురు. ఇదిగాక, ఆత్మయొక్క జన్మమందు ఏకారణమును సంభవింపదు; ఎందు కనఁగా, ఆత్మయొక్క కారణము ఆత్మకన్న భిన్నము గావలసి యుండును; ఆత్మభిన్నము లగు నామరూపాద్యనాత్మపదార్థములు రజ్జుసర్పన్యాయముగ ఆత్మయందు కల్పితములు, అవి ఆత్మకు కారణము లనుట సంభవింపదు; బ్రహ్మము కారణ మనినను సంభవింపదు; ఎందు కనఁగా,

మహాకాశస్వరూపమే ఘటాకాశము; ఈ న్యాయమున బ్రహ్మము ఆత్మయొక్క స్వరూపము; ఎందువలన ఆత్మకు జన్మము లేదో, అందు వలన మరణమును లేదు; జన్మప్రాకట్యవృద్ధివిపరిణామాపక్షయమరణము లను షడ్వికారములును ఆత్మకు లేవు.

ఎందువలన నేను జన్మమరణములు గలవాఁడు కానో, అందు వలన నాకు జన్మమరణములు గావు; ఇవి స్థూలదేహమున కగుచున్నవి; నేను వీనిని ఎఱిఁగినవాఁడైనద్రష్ట ఘటద్రష్టృన్యాయమున వీనికన్న వేఱుగా నున్నాను; ఈరీతిగా ఎఱుఁగవలయును.

ప్ర.—పంచమహాభూత నివృత్తియందు దృష్టాంత మేది ?

ఉ.—ఒకానొకనికి దయ్యము పట్టుకొనినపుడు మాంత్రికుని పిలిచి డమరువు వాదించి లవణాదిపంచవస్తువులు బలిదాన మిచ్చి దయ్యము యొక్క నివృత్తి చేయుచున్నాఁడు; అట్లు ఆకాశాదు లయిన పంచ మహాభూతములు శరీరరూపమై జీవుని పట్టుకొను చున్నవి; తన్నివృత్తికొఱకు బ్రహ్మనిష్ఠగురురూపమాంత్రికుని విధిపూర్వకముగా శరణు పొంది వేదశాస్త్రరూప డమరువు వాదించి, పైఁ జెప్పఁబడిన ఇరువదైదుతత్త్వములందు ఒక్కొక్క భూతమునకు ఐదైదుతత్త్వములు బలి దాన మిచ్చి, నేను ఇరువదైదుతత్త్వములకు ద్రష్టగా నున్నా నని నిశ్చయము చేయుటచే పంచమహాభూతములయొక్క అత్యంత నివృత్తి.

ఈరీతిగా నేను స్థూలదేహముయొక్క ద్రష్టగా నున్నాను.

సూక్ష్మదేహమునకు ద్రష్ట నేను.

ప్ర.—సూక్ష్మదేహము దేనిచే నగును ?

ఉ.—అపంచీకృతము లయిన పదియేడుతత్త్వములచే సూక్ష్మ దేహ మగును; ఆతత్త్వములు.—పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు, మనస్సు, బుద్ధి.

ప్ర.—పంచజ్ఞానేంద్రియము లేవేవి?

ఉ.—శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు.

ప్ర.—పంచకర్మేంద్రియము లేవేవి?

ఉ.—వాక్పాణిపాదోపస్థగుదములు.

ప్ర.—పంచప్రాణము లేవేవి?

ఉ.—ప్రాణాపానసమానోదానవ్యానములు.

ప్ర.—మనస్సు అని దేనికిఁ బేరు?

ఉ.—సంకల్పవికల్పరూపాంతఃకరణవృత్తికి మనస్సని పేరు.

ప్ర.—బుద్ధి యని దేనికిఁ బేరు?

ఉ.—నిశ్చయరూపాంతఃకరణవృత్తికి బుద్ధి యని పేరు.

ప్ర.—అపంచీకృతభూత మనఁగా నేమి?

ఉ.—ఏభూతమునకు పంచీకరణముగా లేదో, అది అపంచీకృత భూత మనఁబడును; అదియే సూక్ష్మభూత మనియు, తన్మాత్ర యనియు అనఁబడును.

ప్ర.—అపంచీకృతభూతములతత్త్వములు ఏరీతిగ ఎఱుఁగవలెను?

ఉ.—ఆకాశసంబంధసత్త్వగుణముచేత జ్ఞానేంద్రియము శ్రోత్రము, రజోగుణముచేత కర్మేంద్రియము వాక్కు; శ్రోత్రము శబ్దమును వినును, వాక్కు ఉచ్చరించును.

వాయుసంబంధసత్త్వగుణముచే జ్ఞానేంద్రియము త్వక్కు, రజోగుణముచే కర్మేంద్రియము పాణి; త్వక్కు స్పర్శమును గ్రహించును, పాణి దానిని నిర్వహించును.

తేజస్సంబంధసత్త్వగుణముచే జ్ఞానేంద్రియము చక్షువు, రజోగుణముచే కర్మేంద్రియము పాదము; చక్షువు రూపగ్రహణము చేయును, పాదము అచ్చట నడచును.

జలసంబంధసత్త్వగుణముచే జ్ఞానేంద్రియము జిహ్వా, రజోగుణముచే కర్మేంద్రియము ఉపస్థము; రసన రసగ్రహణము చేయును, ఉపస్థము రసత్యాగము చేయును.

పృథ్వీసంబంధసత్త్వగుణముచే జ్ఞానేంద్రియము ఘ్రాణము, రజోగుణముచే కర్మేంద్రియము గుదము; ఘ్రాణము గంధగ్రహణము చేయును, గుదము గంధత్యాగము చేయును.

అపంచీకృతభూతముల మిళితరజోగుణాంశముచేత పంచప్రాణములు, మిళితసత్త్వగుణాంశముచేత అంతఃకరణము పుట్టుచున్నది. ఆ యంతఃకరణము మనోబుద్ధిరూపములచేత పరిణామమును పొందును. [ఇచ్చట చిత్తాహంకారములకు మనోబుద్ధులయందే అంతర్భావము.]

ప్ర.—పదియేడుతత్త్వములు ఎఱుఁగుటయందు ఫల మేమి?

ఉ.—ఇవి నేను కాను, ఇవి నావి కావు, ఇవి అపంచీకృతభూత కార్యములు; నేను వీనికి ద్రష్ట యని నిశ్చయము ఫలము.

ప్ర.—ఇవి నేను కాను, నావి కావని ఏ హేతువువలన ఎఱుఁగవలెను?

ఉ.—ఈ తత్త్వములు నెఱుఁగువాఁడు నేను, ఎవ్వఁడు ఎఱుఁగువాఁడో వాఁడు దానికన్న వేఱు, ఇది నియమము.

ప్ర.—ఈసంగతి దృష్టాంతసహితముగఁ జెప్పుము?

ఉ.—(1) నాటకశాలయందు స్థితమైనదీపము, రాజప్రధాననటీతాలధారిసభాసదులు కూర్చుండినపుడు ఆయందఱిని ప్రకాశింపఁ జేయును; అందరు లేచి పోయినపుడును శూన్యగృహమును ప్రకాశింపఁజేయును; అట్లు స్థూలశరీరరూపనాటకశాలయందు నేను సాక్షిరూపదీపము, చిదాభాసుఁడైనరాజు, మనోరూపప్రధానుఁడు, పంచప్రాణ

రూపులయిన అనుచరులు, బుద్ధిరూప నటి, దశేంద్రియరూప తాళధారులు, పంచవిషయరూప సభాసదులు, వీరు జాగ్రత్స్వప్నావస్థలలో నున్నారు; ఈ యందఱిని నేను ప్రకాశింపఁజేయుచున్నాను; సుషుప్త్యవస్థయందు వారిలో నెవ్వరును లేరు; అపుడు వారియొక్క అభావమును ప్రకాశింపఁజేయుచున్నాను; [జాగ్రదవస్థలో ఇంద్రియాంతఃకరణముల సాహాయ్యముచేత, స్వప్నమందు కేవలాంతఃకరణ సాహాయ్యముచేత, సుషుప్తిలో దేనిసాహాయ్యము లేకయు.]

(2) పంచరంధ్రములుగల ఘటములోపల పాత్రతైలవర్తిసహితముగ దీపము జ్వలించుచున్నది; ఆదీపము, ఘటస్థితమైన పాత్రతైలవర్తులు, ఘటాంతరావయవములు, ఛిద్రములు, ఈ యన్నింటిని ప్రకాశింపఁజేసి, ఘటమునకు బాహ్యమయిన వీణాపుష్పగుచ్ఛమణిరసపాత్రకుంకుమములను ప్రకాశింపఁజేసి, సూర్యరూపముచే బ్రహ్మాండమును ప్రకాశింపఁజేసి, మహాతేజోమయ సామాన్యరూపముచే సర్వవ్యాపిగా నున్నది; అట్లు పంచజ్ఞానేంద్రియచ్ఛిద్రములు గల స్థూలదేహరూపఘటములో హృదయకమలపాత్రమందు మనోరూపతైలము, బుద్ధిరూపవర్తి గలవు; వానిమీఁద ఆరూఢమైన ఆత్మరూపదీపము గలదు; అది హృదయపాత్రమును, మనోబుద్ధిరూపతైలవర్తులను, దేహాంతరావయవములను, ఇంద్రియరూపచ్ఛిద్రములను ప్రకాశింపఁజేసి, ఇంద్రియసంబంధము గల శబ్దాదివిషయములను ఇంద్రియద్వారమున ప్రకాశింపఁజేసి, ఈశ్వరరూపముచే బ్రహ్మాండాది బాహ్యప్రపంచమును ప్రకాశింపఁజేసి, సామాన్యచైతన్యబ్రహ్మరూపముచే సర్వవ్యాపిగా నున్నది.

ప్ర.—ఇట్లు చెప్పుటచే ఏనిర్ణయ మగును ?

ఉ.—చెప్పఁబడిన పదియేడుతత్త్వములు నేను కాను, అవి నావి కావు, వీనిని ఎఱిఁగినవాఁడైన ద్రష్ట నేను, ఘటద్రష్టవలె వీనికన్న వేఱుగా 1 నున్నా నని నిర్ణయ మగును.

ప్ర.—ఈతత్త్వములు నేను కానని నావి కావని ఎట్లుఎఱుఁగవలెను?

ఉ.—శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు శబ్దాదివిషయములు గ్రహించి నపుడు వానిని, వాగాదీంద్రియములు వచనాదిక్రియలను జేయునపుడు వానిని, శ్వాసోచ్ఛ్వాసాదిప్రాణములక్రియలను, సంకల్పవికల్పరూప మనోవ్యాపారమును, నిశ్చయరూపబుద్ధివ్యాపారమును, తత్తదభావ మును 2 ఎఱుంగుచున్నాను; గనుక నేను ఘటద్రష్టృన్యాయమున వీని కన్న వేఱుగా నున్నాను, ఈరీతిగా ఎఱుఁగవలయును.

ప్ర.—ఇట్లు ఎఱుఁగుటచే ఏనిశ్చయ మగును ?

ఉ.—లింగదేహము, తద్ధర్మము లైన పుణ్యపాపకర్తృత్వము, తత్ఫలములైనసుఖదుఃఖభోక్తృత్వము, ఇహపరలోకములందు గమనాగమన ములు, వైరాగ్యశమాదిసాత్త్వికవృత్తులు, రాగద్వేషాదిరాజసవృత్తు లు, నిద్రాలస్యాది తామసవృత్తులు, క్షుత్తృషలు, అంధమందపటుత్వ ములు, ఇ వన్నియు నేను కాను, ఇవి నావి కా వని నిశ్చయ మగును.

ప్ర.—కర్తను భోక్తను మొదలుగా నేను కా నని, తద్ధర్మములు నావి కా వని ఏరీతిగ ఎఱుఁగవలెను ?

ఉ.—వికారివస్తువు క్రియ గలది యగుటవలన నది కర్త యని చెప్పఁ బడియె; ఏది కర్త అదే భోక్త, నేను కర్త కాను కనుక భోక్తయును కాను; అంతఃకరణము పరిచ్ఛిన్న మగుటవలన కర్మబలముచే దానికి గమనాగమనములు సంభవించును; నేను ఆకాశవద్వ్యాపకుఁడను కనుక నాకు సంభవింపదు.

రాజవినోదార్థము శిల్పకారుఁడు కారంజి సృజించుచున్నాఁడు; దానియొక్క కీలు తెఱచుటచే మూఁడు జలధారలు యెగిరి, ఆ మూఁడు ధారలలో అనంతధారలు ఎగురుచున్నవి; కీలు నిరోధము చేసినపుడు అన్నిధారలు తిరోధానమై రాజు ఒకఁడే యుండును; అట్లు స్థూలశరీరరూపమందిరమందు కూటస్థాత్మరూపరాజు కూర్చుండఁగా తద్వినోదార్థము మాయారూపశిల్పకారునిచే అంతఃకరణరూప మగు కారంజి సృజింపఁబడినది; జాగ్రత్స్వప్నములందు దానియొక్క ప్రారబ్ధరూప మగు కీలు తెఱచుటచే గుణత్రయరూప మైన మూఁడుధారలు, ఆ మూఁడు ధారలలో వృత్తిరూపాగణితధారలు ఎగురుచున్నవి; మఱియు, సుషుప్తియందు ప్రారబ్ధకర్మకీలు తిరోధాన మగుటచే సకలధారాభావమై కూటస్థరాజు ఒకఁడే యుండును, వాఁడే నేను; త్రిగుణవృత్తులు నేను కాను.

అట్లు నేత్రాదీంద్రియములు తమతమవిషయములను గ్రహింపకుండుట యను అంధతను, అల్పాల్పము గ్రహించుట యను మందతను, స్పష్టముగా గ్రహించుట యను పటుతను నేను ఎఱుఁగుచున్నాను; అందువలన అవి నేను కాను, అవి నావి కావు, నేను వానికి ద్రష్ట, ఘటద్రష్టన్యాయమున వానికన్న వేఱుగా నున్నాను.

## కారణశరీరమునకు ద్రష్ట నేను.

ప్ర.—కారణదేహము ఏది ?

ఉ.—సుషుప్తినుండి లేచినపురుషుఁడు “నేను ఏమియు ఎఱుఁగనైతి” అను సంగతి చెప్పును; దానివలన సుషుప్తిలో అజ్ఞానము సిద్ధమగుచున్నది; జాగ్రత్తయందును “నేను బ్రహ్మమును ఎఱుఁగను, నావార్త నాకు తెలియదు, ఇది ఎఱుఁగను, అది ఎఱుఁగను” ఈ

యనుభవమునకు విషయము అజ్ఞానము; స్వప్నమునకు కారణమును నిద్రారూపాజ్ఞానము, ఈ యజ్ఞానమును కారణదేహ మందురు.

ప్ర.—కారణదేహము నేను కా నని నాదికా దని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—"నేను ఎఱుఁగుచున్నాను, నేను ఎఱుఁగను" ఇట్లు విధినిషేధరూపాంతఃకరణవృత్తులను జ్ఞాతాజ్ఞాతవిషయసహితముగ నేను ఎఱుఁగుచున్నాను; అందువలన ఈ కారణదేహము నేను కాను, ఇది నాది కాదు, ఇది అజ్ఞానము 3 యొక్కయే; నేను దీని నెఱిఁగినవాఁడైన ద్రష్ట ఘట ద్రష్టృన్యాయమున దీనికన్న వేఱుగా నున్నాను.

---

టిప్పణము.

1. కొన్ని గ్రంథములలో.— శిరఃకంఠహృదయోదరకటిగతాకాశములు ఆకాశముయొక్క పంచతత్త్వములని చెప్పఁబడినది, దానిలో;

శిరోదేశగతాకాశము అనాహతశబ్దమున కాశ్రయ మగుటవలన ఆకాశమునకు ముఖ్యభాగము, శ్వాసోచ్ఛ్వాసముల కాశ్రయమగుటవలన కంఠదేశాకాశము వాయుభాగము; పిత్తమున కాశ్రయ మగుటవలన హృదయదేశాకాశము తేజోభాగము; పాశితజలమున కాశ్రయ మగుటవలన ఉదరదేశాకాశము జలభాగము; గంధమున కాశ్రయ మగుటవలన కటిదేశాకాశము పృథ్వీభాగము.

అట్లు గ్రంథాంతరమందు కామక్రోధాదులు స్థూలదేహధర్మములు కా వని, లింగదేహధర్మము లని చెప్పఁబడినది.

కొన్ని గ్రంథములలో కామాదులు లింగదేహమునకు ముఖ్యధర్మము లయి, స్థూలదేహమందు వానికి ఆవేశ మని చెప్పఁబడినది. [ఘటమందు జలము నుంచినపుడు దానిశీతలత బయటికి ప్రకట మగునట్లు.]

కొన్నిచోటులలో సదా అపూర్ణముగ నుండుటవలన లోభము ను ఆకాశమునకు ముఖ్యభాగ మని చెప్పఁబడినది.

2. కార్యోత్పత్తికి పూర్వముగ నుండు అభావము ప్రాగభావ మని, నాశానంతరము ప్రాప్తమయిన అభావము ప్రధ్వంసాభావ మని, త్రికాలమం దుండు అభావము అత్యంతాభావ మని, ఒకవస్తువునకు అన్యవస్తువుతో భేదము అన్యోన్యాభావ మని, ఒకకాలమం దుండి రెండవకాలమందు లే కుండుట సామయికాభావ మని చెప్పఁబడినది.

3. అజ్ఞానము, స్థూలసూక్ష్మప్రపంచమునకు హేతు వగుటవలన దానిని కారణ మనుచున్నారు; దానికి తత్త్వజ్ఞానముచే దాహ మగుట వలన దేహ మనుచున్నారు.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - దేహత్రయద్రష్టృవర్ణననామికా తృతీయకలా సంపూర్ణా.

## చతుర్థకల.

### నేను పంచకోశాతీతుఁడు.

ప్ర.—కోశ మనఁగా నేమి ?

ఉ.—కత్తియొక్క యొఱకును, ధనభాండాగారమునకును, కోశకార మను పురుగుయొక్క ఇంటికిని కోశ మని పేరు; ఒఱ మొదలయిన

మూఁడును కత్తి ధనము పురుగు ఈ మూఁడింటిని మూయు చున్నవి; అట్లు పంచకోశములు ఆత్మను మూయుచున్నవి; కనుక అన్నమయాదులను కోశ మనుచున్నారు.

ప్ర.—పంచకోశముల నామములు ఏవేవి ?

ఉ.—అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము.

ప్ర.—అన్నమయకోశ మేది ?

ఉ.—మాతాపితృలచే భక్షింపఁబడిన అన్నమువలన పుట్టిన రజస్సు వీర్యము వీనివలన మాతృజఠరమందు పుట్టుచున్నది; మరల అన్నముచే వృద్ధి యగుచున్నది; మరణానంతరము అన్నమయపృథ్వియందు లయ మగుచున్నది; ఇట్టి ఏస్థూలశరీరము గలదో, దానిని అన్నమయకోశ మందురు.

ప్ర.—అన్నమయకోశము ఎట్లున్నది?

ఉ.—ఇది సుఖదుఃఖానుభవరూపభోగములకు స్థానముగ నున్నది.

ప్ర.—అన్నమయకోశముకన్న నేను వే అని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—జన్మముకన్న మునుపు మరణమునకు వెనుక స్థూలశరీరాభావము గలదు; ఈరీతిగా ఉత్పత్తినాశములు గలిగియుండుటవలన ఘటమువలె ఇది కార్యముగ నున్నది; నేను ఉత్పత్తినాశరహితుఁ డగుటవలన దానికన్న వేఱుగా నున్నాను.

ప్ర.—ప్రాణమయకోశ మనున దేమి ?

ఉ.—పంచకర్మేంద్రియములతోఁ జేరిన పంచప్రాణములు ప్రాణమయకోశ మనఁబడును.

ప్ర.—పంచప్రాణములకు స్థానక్రియలు ఏవేవి ?

ఉ.—ప్రాణము—హృదయస్థానము 21600 అజపాజపము క్రియ.

అపానము—గుదస్థానము, మలమూత్రోత్సర్గము క్రియ.

సమానము—నాభిస్థానము, భోజనము చేసిన అన్నముయొక్క రసమును నాడీద్వారమున సకలశరీరమందు చేర్చుట క్రియ.

ఉదానము—కంఠస్థానము, తిన్నయన్నమును త్రాగిన జలమును విభజించుట క్రియ.

వ్యానము—సర్వాంగస్థానము, సర్వాంగములయొక్క సంధులను వ్యవస్థ చేయుట క్రియ.

ప్ర.—ప్రాణాదివాయువులు శరీరమందు ఏమి చేయుచున్నవి ?

ఉ.—ప్రాణాదివాయువులు అంతట శరీరమందు పూర్ణము లయి, శరీరమునకు బలము నిచ్చి, ఇంద్రియములను తమతమక్రియలందు ప్రవర్తింపఁజేయు చున్నవి.

ప్ర.—ప్రాణమయకోశముకన్న నేను వే ఱని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—పురుషుఁడు పండుకొన్నపుడు, ఒకానొక మిత్రుఁడు వచ్చిన ఆదరము చేయఁడు; దొంగ వచ్చి, సొమ్ము తీసికొనిపోయిన నిషేధము చేయఁడు; అందువలన ప్రాణము ఘటమువలె జడము; నేను చైతన్యరూపుఁ డగుటవలన ప్రాణములకన్న వే ఱని ఎఱుఁగవలెను.

ప్ర.—మనోమయకోశ మేది ?

ఉ.—పంచజ్ఞానేంద్రియములతోఁ గూడిన మనస్సు మనోమయకోశము.

ప్ర.—మనస్సు ఎట్లున్నది ?

ఉ.—దేహవిషయమందు అహంతారూప మగు, గృహాదివిషయ

మందు మమతారూప మగు అభిమానమునకు కర్తృరూపముగాను, ఇంద్రియద్వారమున బాహ్యగామియై కరణరూపముగాను ఉన్నది.

ప్ర.—నేను మనోమయకోశముకన్న వేఅని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—కామక్రోధాదివృత్తి యుక్తమగుటవలన మనస్సు నియమ రహితస్వభావము గలదిగాను వికారిగాను ఉన్నది; నేను సర్వవృత్తుల సాక్షి నగుటవలన, నిర్వికారుఁడ నగుటవలన మనోమయకోశముకన్న వే అని ఎఱుఁగవలెను.

ప్ర.—విజ్ఞానమయకోశ మేది?

ఉ.—పంచజ్ఞానేంద్రియములతోఁ గూడిన బుద్ధి విజ్ఞానమయకోశము.

ప్ర.—బుద్ధి ఎట్టున్నది ?

ఉ.—సుషుప్తియందు విలీనమై, జాగ్రత్తియందు నఖశిఖాగ్రపర్యంతముగ వ్యాపించి కర్తృరూపముగ నున్నది.

ప్ర.—విజ్ఞానమయకోశముకన్న నేను వేఅని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—బుద్ధి ఘటాదికమువలె విలయాద్యవస్థ గలది యగుటవలన వినాశిగా నున్నది; నేను విలయాద్యవస్థరహితుఁడ నగుటవలన విజ్ఞానమయకోశముకన్న వే అని ఎఱుఁగవలెను.

ప్ర.—ఆనందమయకోశ మేది ?

ఉ.—పుణ్యకర్మఫలానుభవకాలమందు బుద్ధివృత్తి అంతర్ముఖమై; ఆత్మస్వరూపభూత మగు ఆనందప్రతిబింబమును ధరించి, ప్రియమోదప్రమోదరూపానుభవము చేసి, కారణాజ్ఞానరూపసుషుప్తియందు విలీన మగుచున్నది; అవృత్తి ఆనందమయకోశము.

ప్ర.—ఆనందమయకోశమునకు స్వరూపము ఎట్లు గలదు ?

ఉ.—ఇష్టవస్తుదర్శనముచేఁ గలిగినదైన ప్రియవృత్తి దేనికి శిరస్సో, ఇష్టవస్తులాభముచేఁ గలిగినదైన మోదవృత్తి దేనికి దక్షిణపక్షమో,

ఇష్టవస్తుభోగముచేఁ గలిగినదైన ప్రమోదవృత్తి దేనికి వామపక్షమో, అజ్ఞానవృత్తియందు ఆత్మస్వరూపానందప్రతిబింబము దేనికి స్వరూపమో, బింబరూపాత్మానందము దేనికి పుచ్ఛమో అనఁగా ఆధారమో, ఇట్లు పక్షిరూపభోక్త యగు ఆనందమయకోశము గలదు.

ప్ర.—ఆనందమయకోశముకన్న నేను వే అని ఎట్లు ఎఱుఁగవలెను?

ఉ.—ఆనందమయకోశము ఆకాశాభ్రాది పదార్థమువలె కదాచిత్ప్రకట మయినట్టిది యగుటవలన నది క్షణికము, నేను సర్వదా స్థితుఁడ నగుటవలన నిత్యుఁడను; అందువలన నేను ఆనందమయకోశముకన్న వే అని ఎఱుఁగవలెను.

ప్ర.—అన్నమయాదికోశములు నేను కానియపుడు నే నెవ్వఁడను?

ఉ.—అజ్ఞానమందు ప్రతిబింబరూపముచే స్థితమై, ప్రియాదిశబ్దములచే జెప్పఁబడిన ఆనందమయకోశమునకు బింబభూతానందాత్మ నేను.

ప్ర.—పంచకోశములు అనుభవమునకు వచ్చును; వానికన్న వే అయిన ఆత్మ అనుభవమునకు రాఁడు?

ఉ.—యద్యపి పంచకోశములే అనుభవమునకు వచ్చుచున్నవి; తద్భిన్నాత్మ అనుభవమందు రాఁడు, తథాపి ఏ యనుభవముచే కోశములు ఎఱుఁగఁబడినవో, ఆ యనుభవమును నివర్తించువాఁ డెవఁడు? ఎవ్వఁడును లేఁడు; ఆ యనుభవరూపాత్మ కోశములకన్న వేఱే.

---

టిప్పణము.

1. అజ్ఞానము కారణదేహరూప మైనను, దానిని అజ్ఞానముయొక్క కారణదేహ మనుట రాహువుయొక్క శిర స్సనుటవలె.

2. ఎట్లు దీపప్రకాశము, మఱియు ఆకాశము అభిన్నముగ ప్రతీత మైనను భిన్నములే యగునో; తప్తలోహమందు అగ్ని, లోహము అభిన్నముగ ప్రతీత మైనను భిన్నములే యగునో; అట్లు అంతఃకరణము, ఆత్మ అభిన్నముగ ప్రతీత మైనను భిన్నములే యగును.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - పంచకోశాతీతాత్మవర్ణననామికా చతుర్థకలా సంపూర్ణా.

## పంచమకల.

### అవస్థాత్రయమునకు సాక్షి నేను.



ప్ర.—మూఁడుఅవస్థలు ఏవేవి ?

ఉ.—జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి ఇవి మూఁడుఅవస్థలు.

జాగ్రదవస్థకు సాక్షి నేను.

ప్ర.—జాగ్రదవస్థ అనున దేమి?

ఉ.—పదినాలుగు ఇంద్రియములు అధ్యాత్మములు, వానికి పదినాలుగు అధిదేవతలు, వానికి పదినాలుగు విషయములు; ఈ నలువదిరెండు తత్త్వములచే వ్యవహారము దేనియం దగునో అది జాగ్రదవస్థ.

| జ్ఞానేంద్రియపంచకము. | | | కర్మేంద్రియపంచకము. | | |
|---|---|---|---|---|---|
| ఇంద్రియ | అధిదైవత | అధిభూత | ఇంద్రియ | అధిదైవత | అధిభూత |

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రోత్రము | దిశ | శబ్దము | వాక్కు | అగ్ని | వచనము |
| త్వక్కు | వాయువు | స్పర్శము | హస్తము | ఇంద్రుఁడు | ఆదానము |
| చక్షుస్సు | సూర్యుఁడు | రూపము | పాదము | వామనుఁడు | గమనము |
| జివ్హా | వరుణుఁడు | రసము | ఉపస్థము | ప్రజాపతి | ఆనందము |
| ఘ్రాణము | అశ్వి | గంధము | గుదము | యముఁడు | మలత్యాగము |

అంతఃకరణచతుష్టయము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మనస్సు | చంద్రుఁడు | సంకల్పవికల్ప | బుద్ధి | బ్రహ్మ | నిశ్చయము |
| చిత్తము | వాసుదేవుఁడు | చింతనము | అహంకారము | రుద్రుఁడు | అహంత |

అధ్యాత్మము 1 అధిదైవము 2 అధిభూతము 3 ఈ మూఁడుచేరి త్రిపుటి.

ప్ర.—త్రిపుటిస్వభావ మెట్లు ?

ఉ.—త్రిపుటియందు ఇంద్రియదేవతావిషయములందు ఒకానొక పదార్థము తక్కువ యయినపక్షమందు దానివ్యవహారము నడవదు.

ప్ర.—నాస్వభావ మెట్లు?

ఉ.—త్రిపుటిని పూర్ణమైనదానిని, అపూర్ణ మయినదానిని, వ్యవహారము నడచుచున్నదానిని, నడవనిదానిని నేను ఎఱుఁగుచున్నాను.

ప్ర.—జాగ్రదవస్థయందు జీవునిస్థానము, వాణి, భోగము, శక్తి, గుణము, మఱియు జాగ్రదభిమానిజీవుఁడు వీనినామములు ఏవేవి ?

ఉ.—జాగ్రదవస్థలో నేత్రముస్థానము, వైఖరీవాణి, స్థూలభోగము, క్రియాశక్తి, రజోగుణము, మఱియు విశ్వుఁడని నామము.

ప్ర.—జాగ్రదవస్థ యనుటచే ఏమి సిద్ధ మయినది ?

ఉ.—ఇపుడు జాగ్రదవస్థ 4 గలదు, దానిని స్వప్నసుషుప్తులందు లేనపుడు దానిఅభావమును నేను ఎఱుఁగుచున్నాను; అం

దువలన ఈ జాగ్రదవస్థ నేను కాను, ఇది నాది కాదు, ఇది స్థూలదేహ ముయొక్కయే, నేను దీనికి సాక్షిగా నున్నా నని సిద్ధ మైనది.

స్వప్నావస్థకు సాక్షి నేను.

ప్ర.—స్వప్నావస్థ యనున దేమి ?

ఉ.—జాగ్రదవస్థయందు చెప్పఁబడినది, వినఁబడినది, భుక్తమైనది, వానిసూక్ష్మసంస్కారము కంఠస్థిత మైన హితానాడియం దుండుటచే నిద్రాకాలమందు పంచవిషయాది పదార్థములును, తద్జ్ఞానమును పుట్టి, వానివ్యవహారము నడుచుచున్నది; ఇట్టిది స్వప్నావస్థ. 5

ప్ర.—స్వప్నావస్థయందు జీవునిస్థానము, వాణి, భోగము, శక్తి, గుణము, మఱియు నామము ఏమేమి?

ఉ.—స్వప్నావస్థయందు కంఠము స్థానము, మధ్యమావాణి, సూక్ష్మభోగము, జ్ఞానశక్తి, సత్త్వగుణము, 6 తైజసుఁ డని నామము.

ప్ర.—స్వప్నావస్థ చెప్పుటచే ఏమి సిద్ధ మైనది ?

ఉ.—స్వప్నావస్థను, జాగ్రత్సుషుప్తులందు అది లేనపుడు తద భావమును నేను ఎఱుఁగుచున్నాను; కనుక స్వప్నావస్థ నేను కాను, అది నాది కాదు, అది సూక్ష్మదేహముయొక్కయే; నేను దానిని ఎఱిఁగినవాఁ డైన సాక్షిగా నున్నా నని సిద్ధ మైనది.

సుషుప్త్యవస్థకు సాక్షి నేను.

ప్ర.—సుషుప్త్యవస్థ యనున దేమి?

ఉ.—" నేను సుఖముగ పండుకొంటిని, ఏమియు ఎఱుఁగనైతిని" ఈ సుఖాజ్ఞానములకు ప్రకాశము సాక్షిచైతన్యద్వారమున దేనియందగునో, అట్టి బుద్ధియొక్క విలయావస్థయే సుషుప్త్యవస్థ. 7

ప్ర.—సుషుప్తియందు జీవునిస్థానము, వాణి, భోగము, శక్తి, గుణము, మఱియు నామము ఏమేమి ?

ఉ.—సుషుప్తియందు హృదయము స్థానము, పశ్యంతివాణి, ఆనందభోగము, ద్రవ్యశక్తి, తమోగుణము, మఱియు ప్రాజ్ఞుఁ డని నామము.

ప్ర.—సుషుప్త్యవస్థవిషయమందు దృష్టాంతము లేవేవి?

ఉ.—(1) పడిపోయిన అలంకారముకొఱకు ఒకఁడు కూపమందు దిగుచున్నాఁడు; మునిఁగినపుడు అలంకారము దొరకిన యెడల దానిని ఎఱుఁగును; దొరకనిపక్షమందు దానిని ఎఱుఁగును; అయినను, చెప్పుటకు సాధనము వాగింద్రియము, తద్దేవతాగ్నికి జలముతో విరోధమగుటవలన తిరోధాన మగుచున్నది; అందువలన ఆవార్త చెప్పఁడు; జలమునుండి బయిటవచ్చినపుడు దేవత ప్రకట మగుటవలన ఆ వార్త చెప్పుచున్నాఁడు; అట్లు సుషుప్తియందు సుఖముయొక్కయు, అజ్ఞానముయొక్కయు సామాన్యజ్ఞానము గలదు; అయినను, విశేషజ్ఞానమునకు సాధనము లగు ఇంద్రియాంతఃకరణములకు అభావ మగుటవలన సుఖజ్ఞానముల విశేషజ్ఞానము గానేరదు; ఎపుడు పురుషుఁడు లేచుచున్నాఁడో, అపుడు ఇంద్రియాంతఃకరణములకు సద్భావ మగుటవలన సుషుప్తియందు అనుభూత మైన సుఖాజ్ఞానములకు స్మృతిరూపవిశేషజ్ఞాన మగుచున్నది.

(2) ఆతపమందు ద్రవించిన ఘృతము నీడయందుంచినపుడు గట్టియై, మఱల ఆతపమందు ద్రవించుచున్నది; అట్లు సుషుప్తియందు కారణరూపాజ్ఞానము జాగ్రత్స్వప్నములందు బుద్ధిరూపమై, మఱల సుషుప్తియందు అజ్ఞానరూప మగుచున్నది.

(3) బాలకుఁడు పిల్లవాండ్రతో ఆటఆడుటకుపోయి, శ్రమమును పొంది తల్లితొడమీఁద విశ్రాంతిసుఖానుభవము చేయుచున్నాఁడు; మఱల పిల్లవాండ్రు పిలిచినపుడు బయిటపోయి ఆట ఆడుచున్నాఁడు;

అట్లు కారణశరీరాజ్ఞానరూప యగు తల్లియొక్క బుద్ధిరూపబాలకుఁడు కర్మరూపు లగు పిల్లవాండ్రతో జాగ్రత్స్వప్నరూపబహిర్భూమియందు వ్యవహారరూప మగు ఆటలాడుచున్నాఁడు; అచ్చట విక్షేపరూపశ్రమ మునుపొంది, సుషుప్త్యవస్థారూపగృహములో అజ్ఞానరూపమాత యందు లీనుఁడై, బ్రహ్మానందానుభవము చేయుచున్నాఁడు; మఱల కర్మరూపు లగు పిల్లవాండ్రు పిలిచినపుడు జాగ్రదాదిభూమిలో వ్యవహారరూప మైన ఆట చేయుచున్నాఁడు.

(4) సముద్రజలముచే పూర్ణ మైన ఘటమునకు కంఠమున త్రాడు కట్టి సముద్రమందు విడిచినపుడు, ఘటస్థితజలము సముద్రజలముతో ఏకీభావము పొందుచున్నది; అట్లయినను, ఉపాధియోగముచే భిన్నమువలె నున్నది; మరల త్రాడు ఆకర్షించినపుడు భేదమును పొందుచున్నది; అట్లయినను, సజలఘటసముద్రములకు ఆధార మైన ఆకాశము భిన్నము గాదు; అట్లు అజ్ఞానరూపసముద్రజలముచే పూర్ణ మైన లింగదేహరూపఘటము అదృష్టరూపరజ్జువుతో కట్టి, సుషుప్తి మూర్ఛా మరణప్రలయకాలములందు సమష్ట్యజ్ఞాన మైన ఈశ్వరోపాధియందు లీనమయినపుడు, జీవోపాధి యగు వ్యష్ట్యజ్ఞానము సమష్ట్యజ్ఞానముతో ఏకీభావము పొందుచున్నది; అట్లయినను, లింగశరీరసంస్కారరూపోపాధియోగముచే భిన్నమువలె నున్నది; ఎపుడు అదృష్టరూపరజ్జువును అంతర్యామి ప్రేరించునో; అపుడు భేదమును పొందుచున్నది; అయినను, లింగదేహరూపఘటమునకును, సమష్ట్యజ్ఞానరూపసముద్రమునకును ఆధార మైన చిదాకాశము భిన్నము గాదు.

ప్ర.—సుషుప్తికథనముచే ఏమి సిద్ధ మగుచున్నది?

ఉ.—సుషుప్త్యవస్థను నేను ఎఱుఁగుచున్నాను; జాగ్రత్స్వప్నములందు అది లేనపుడు దాని యభావమును నేను ఎఱుఁగుచున్నాను;

అందువలన అది నేను కాను, అది నాది కాదు, అది కారణదేహము. దానిని ఎఱిఁగినవాఁడైన సాక్షి నేను, ఘటసాక్షివలె దానికి వేఱుగా నున్నా నని సిద్ధ మగుచున్నది.

---

టిప్పణము.

1. ఆత్మాశ్రితము లైన ఇంద్రియాదులు అధ్యాత్మ మనఁబడును.

2. స్వసంఘాతముకన్న భిన్నమై, చక్షురాదీంద్రియములకు విషయ మైనది అధిదైవ మనఁబడును.

3. స్వసంఘాతముకన్న భిన్నమై, చక్షురాదీంద్రియములకు విషయ మైనది అధిభూత మనఁబడును.

4. స్వప్నసుషుప్తులకన్న భిన్నమై, ఇంద్రియజన్యజ్ఞానమునకును తత్సంస్కారమునకును ఆధారకాలము జాగ్రదవస్థ యనఁబడును.

5. ఇంద్రియములచే అజన్యమై, విషయగోచర మైన అంతఃకరణపరోక్షవృత్తియొక్క కాలము స్వప్నావస్థ యనఁబడును.

6. కొన్నిచోట్ల స్వప్నమందు రజోగుణ మనియు చెప్పఁబడినది.

7. సుఖగోచరమై, అవిద్యాగోచర మైన అవిద్యావృత్తియొక్క కాలము సుషుప్త్యవస్థ యనఁబడును.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - అవస్థాత్రయసాక్షివర్ణననామికా పంచమకలా సంపూర్ణా.



# షష్ఠకల.

## ప్రపంచమిథ్యాత్వవర్ణనము.



ప్ర.—ఆత్మయందు మూఁడుఅవస్థలు ఏరీతిగ భాసిల్లును ?

ఉ.—శుక్తియందు రజతము, లేక అభ్రకము, లేక కాకితము శుక్త్యజ్ఞానముచే కల్పితముగ భాసిల్లును; ఈ మూఁడువస్తువులకు పరస్పరమును శుక్తితోడను వ్యతిరేకము; మఱియు శుక్తికి మూఁడువస్తువులతో అన్వయము గలదు; చూడుము.—

ఎపుడు రజతము కనఁబడునో, అపుడు అభ్రకము, కాకితము కనఁబడవు; అభ్రకము కనఁబడినపుడు రజతము, కాకితము కనఁబడవు; కాకితము కనఁబడినపుడు రజతము, అభ్రకము కనఁబడవు; ఈరీతిగా పరస్పరవ్యతిరేకము.

శుక్తిలో ఆద్యంతమధ్యములందు వ్యావహారికదృష్టిచే, పారమార్థికదృష్టిచే ఈ మూఁడువస్తువులకు అత్యంతాభావము గలదు; ఈ రీతిగా శుక్తికి మూఁడువస్తువులతో వ్యతిరేకము.

భ్రాంతికాలమందు " ఇది రజతము, ఇది అభ్రకము, ఇది కాకితము " ఈరీతిగా శుక్తినిష్ఠమైన ఇదమంశము మూఁడువస్తువులందు భాసిల్లును; ఈరీతిగా మూఁడువస్తువులందు శుక్తికి అన్వయము.

ఇచ్చట సామాన్యవిశేష కల్పితవిశేషము లని శుక్తికి మూఁడు అంశములు గలవు; వానిలో,—

ఇదంత సామాన్యాంశము; ఎందు కనఁగా:—అధికకాలమందు ప్రతీతమైనది సామాన్యాంశ మనఁబడును; భ్రాంతికాలమందు " ఇది

రజతము " భ్రాంత్యభావకాలమందు " ఇది శుక్తి " అను నీవిధముగా ఇదమంశము ప్రతీత మగును; కావున ఇదమంశము సామాన్యమనియు, ఆధార మనియు చెప్పఁబడును.

"నీలపృష్ఠత్రికోణాకృతి శుక్తి" అనునది విశేషాంశము; ఎందుకనఁగా న్యూనకాలమందు ప్రతీతమైనది విశేషాంశ మనఁబడును; భ్రాంతికాలమందు నీలపృష్ఠాది ప్రతీతము గాదు; కావున అది విశేషాంశ మనియు, అధిష్ఠాన మనియు చెప్పఁబడును.

రజతాదులు కల్పితవిశేషాంశములు; ఎందు కనఁగా.—ఏది అధిష్ఠానజ్ఞానకాలమందు ప్రతీతము గాదో, అది కల్పితవిశేషాంశ మనఁబడును; రజతాదులు శుక్త్యజ్ఞానకాలమందే ప్రతీత మగును; జ్ఞానకాలమందు ప్రతీతములు గావు; కావున అవి కల్పితవిశేషాంశ మనియు, భ్రాంతి యనియు చెప్పఁబడును.

అట్లు అధిష్ఠానరూపాత్మయందు జాగ్రత్త్, స్వప్నము, సుషుప్తి యను అవస్థలు ఆత్మయొక్క అజ్ఞానమువలన పుట్టుచున్నవి; వానికి పరస్పరమును ఆత్మతోడను వ్యతిరేకము. మఱియు ఆత్మకు వాని విషయమందు అన్వయము గలదు; చూడుము.—

జాగ్రత్త భాసిల్లునపుడు స్వప్నసుషుప్తులు భాసిల్లవు, స్వప్నము భాసిల్లునపుడు జాగ్రత్సుషుప్తులు భాసిల్లవు, సుషుప్తి భాసిల్లునపుడు జాగ్రత్స్వప్నములు భాసిల్లవు; ఇట్లు మూఁడవస్థలందు పరస్పరవ్యతిరేకము.

అధిష్ఠానములో ఈ మూఁడవస్థలకు పారమార్థిక మైన అత్యంతాభావము గలదు; ఈరీతిగా అవస్థలకు ఆత్మతో వ్యతిరేకము.

ఆత్మ మూఁడుఅవస్థలందును అనుస్యూతుఁడుగా నున్నాఁడు; ఈరీతిగా అవస్థాత్రయముతో ఆత్మకు అన్వయము.

ఇచ్చట ఆత్మకును అవిద్యాదృష్టిచే మూఁడంశములు గలవు.—

"జాగ్రత్తే యున్నది, స్వప్న మున్నది, సుషుప్తి యున్నది" ఈ రీతిగా సద్రూపము భ్రాంతికాలమందును ప్రతీత మగును "నేను సద్రూపుఁడుగ నున్నాను, నేను చిద్రూపుఁడుగ నున్నాను, నేను ఆనందరూపుఁడుగ నున్నాను" ఈరీతిగా భ్రాంతినివృత్తికాలమందును ప్రతీత మగును; కావున సద్రూపము అనఁగా—"ఉన్నది" అను లక్షణము సామాన్యాంశ మనియు, ఆధార మనియు చెప్పఁబడును.

చేతనానందాదు లయిన ఆత్మలక్షణముల ప్రతీతి భ్రాంతికాలమందుఁ గానేరదు; కావున చేతనానందాదులు విశేషాంశ మనియు, అధిష్ఠాన మనియు చెప్పఁబడును.

బ్రహ్మాభిన్నాత్మయొక్క అజ్ఞానకాలమందు అవస్థాత్రయప్రపంచము ప్రతీత మగును; బ్రహ్మాభిన్నాత్మజ్ఞానకాలమందు ప్రతీతము గాదు; కావున ప్రపంచము కల్పితవిశేషాంశ మనియు, భ్రాంతి యనియు చెప్పఁబడును.

ఈరీతిగా మూఁడవస్థలు ఆత్మయందు మిథ్యాప్రతీత మగుచున్నవి. ఆ మిథ్యాత్వప్రతీతికే బాధ 1 యనుచున్నారు.

ప్ర.—భ్రాంతిరూపసంసారము ఎన్నిప్రకారములుగాఁ గలదు?

ఉ.—భేదభ్రాంతి 2 కర్తృత్వభోక్తృత్వభ్రాంతి 3 సంగభ్రాంతి 4 వికారభ్రాంతి 5 బ్రహ్మభిన్నజగత్సత్యత్వభ్రాంతి, ఈ ప్రకారముగ పంచభ్రాంతిరూప మగు సంసారము గలదు.

ప్ర.—పంచవిధభ్రాంతికి నివృత్తి ఏయేదృష్టాంతముచే నగును?

ఉ.—బింబ ప్రతిబింబ దృష్టాంతముచే భేదభ్రాంతికి, స్ఫటికజపాకుసుమదృష్టాంతముచే కర్తృత్వభోక్తృత్వభ్రాంతికి, ఘటాకాశదృష్టాంతముచే సంగభ్రాంతికి, రజ్జుసర్పదృష్టాంతముచే వికారభ్రాంతికి,

కనకకుండలదృష్టాంతముచే బ్రహ్మాభిన్నజగత్సత్యత్వభ్రాంతికి నివృత్తి యగును.—

ఎపుడు దర్పణమునందు ముఖమునకు ప్రతిబింబము భాసిల్లునో, అపుడు ఆప్రతిబింబము దర్పణమునందు లేదు; మ ఱే మనిన, దర్పణమును విషయము చేయుటకొఱకు బయిటవచ్చిన నేత్రవృత్తి దర్పణమును స్పర్శము చేసి, ప్రత్యాగామియై ముఖమును చూచుచున్నది; ఈరీతిగా బింబ మయిన ముఖముతో ప్రతిబింబము అభిన్న మగుటవలన ప్రతిబింబము సత్యము, ప్రతిబింబధర్మము లయిన బింబముతో భిన్నత, విపరీతత, దర్పణస్థితి ఇవి మూఁడును, తత్ప్రతీతియును భ్రాంతిరూపము; అట్లు శుద్ధబ్రహ్మరూపబింబమునకు అజ్ఞానరూపదర్పణమందు జీవరూపప్రతిబింబము భాసిల్లినది; ఆ ప్రతిబింబము బ్రహ్మరూప మైన బింబముతో సదా అభిన్నముగ నున్నది; ఐనను, బ్రహ్మముతో భేదము, జీవత్వము మొదలైనధర్మములును, తద్జ్ఞానమును భ్రాంతిరూపము; ఈరీతిగా బింబ ప్రతిబింబదృష్టాంతముచే భేదభ్రాంతికి నివృత్తి యగుచున్నది.

జపాకుసుమసమీపమున స్ఫటికమణి యుండినపుడు కుసుమగతా రక్తవర్ణము స్ఫటికమందు కుసుమసంయోగముచే భాసిల్లును; వియోగ మైనపుడు భాసిల్లదు, కనుక అది స్ఫటికధర్మము కాదు; స్ఫటికధర్మ మనుట భ్రాంతి; అట్లు అంతఃకరణధర్మము లయిన కర్తృత్వభోక్తృత్వములు ఆత్మయందు తాదాత్మ్యసంబంధముచే భాసిల్లును; సుషుప్తియందు అంతఃకరణమునకు ఆత్మతో వియోగ మైనపుడు ఆత్మయందు భాసిల్లవు; కావున అవి ఆత్మధర్మములు కావు; ఆత్మధర్మము లనుట భ్రాంతి; ఈరీతిగా స్ఫటికపుష్పదృష్టాంతముచే కర్తృత్వభోక్తృత్వభ్రాంతికి నివృత్తి యగుచున్నది.



ఘటోపహితాకాశము ఘటాకాశ మనఁబడును; ఆయాకాశము యద్యపి ఘటముతోడ భాసిల్లును; తథాపి ఘటధర్మము లయిన ఉత్పత్తినాశాదులు ఆయాకాశమును స్పృశింపవు; కనుక ఆకాశము అసంగము, దానికి ఘటముతో సంబంధ మనుట భ్రాంతి; అట్లు దేహాది సంఘాతోపహితాత్మ జీవుఁ డనఁబడును; ఆ యాత్మ సంఘాతముతో భాసిల్లినను, సంఘాతధర్మము లైన జననమరణాదులు ఆత్మను స్పృశింపవు; అవి ఆత్మధర్మ మనుట భ్రాంతి; ఈరీతిగా ఘటాకాశదృష్టాంతముచే సంగభ్రాంతికి నివృత్తి యగుచున్నది.

మందాంధకారస్థితమైన రజ్జువును చూచుటకొఱకు నేత్రద్వారమున రజ్జువువఱకు వచ్చినదైన అంతఃకరణవృత్తిచే రజ్వావరణభంగము సంపూర్ణముగ గాదు; అపుడు రజ్జుచైతన్యాశ్రితావిద్య క్షోభితమై సర్పరూపవికారమును పొందును; ఆ సర్పము మిథ్య; అట్లు బ్రహ్మచైతన్యాశ్రితావిద్య ప్రారబ్ధనిమిత్తముచే క్షోభమును పొంది ప్రపంచరూపవికారమును 7 పొందును; ఆ ప్రపంచము అధిష్ఠాన 8 చైతన్యవివర్తము 9; ఈరీతిగా రజ్జుసర్పదృష్టాంతముచే వికారభ్రాంతికి నివృత్తి.

కనకము, కుండలము ఇవి అభిన్నములుగ నుండినను, కారణమనియు, కార్య మనియు భేదప్రతీతి యగును; విచారముచే చూచిన, కుండలము కనకముకన్న భిన్నముగా కనఁబడదు; అట్లు జగత్తునకు బ్రహ్మముతో కార్యకారణభావముచే భేదము భాసిల్లును, అది కల్పితము; ఈరీతిగా కనకకుండలదృష్టాంతముచే బ్రహ్మభిన్నజగత్సత్యత్వభ్రాంతికి నివృత్తి యగుచున్నది.

ప్ర.—అధ్యాస మని దేనికి పేరు ?

ఉ.—భ్రాంతిజ్ఞానమునకు విషయ మయిన మిథ్యావస్తువు, మఱియు భ్రాంతిజ్ఞానము ఈ రెంటికి పేరు అధ్యాస మని.

ప్ర.—అధ్యాసము యెన్నివిధములు ?

ఉ.—అర్థాధ్యాసము, జ్ఞానాధ్యాసము ఈభేదముచే అధ్యాసము ద్వివిధము; దానిలో అర్థాధ్యాసమునకు ఆఱుభేదములు.—కేవల సంబంధాధ్యాసము, సంబంధసహితసంబంధ్యధ్యాసము, కేవల ధర్మాధ్యాసము, ధర్మసహితధర్మ్యధ్యాసము, అన్యోన్యాధ్యాసము, అన్యతరాధ్యాసము, లేక, స్వరూపాధ్యాసము, సంసర్గాధ్యాసము ఈ భేదమువలన అర్థాధ్యాసము ద్వివిధము; ఇపుడు చెప్పఁబడిన ఆఱుభేదములును వీనిలో అంతర్గతములు.

ప్ర.—ఆత్మవిచారమందు విశేషోపయుక్త మైనట్టి అధ్యాస మేది ?

ఉ.—అన్యోన్యాధ్యాసము.

ప్ర.—అన్యోన్యాధ్యాస మని దేనికి పేరు ?

ఉ.—పరస్పరాధ్యాసమునకు అన్యోన్యాధ్యాస మని పేరు.

ప్ర.—ఆత్మానాత్మలకు పరస్పరాధ్యాసము ఏరీతిగా కలుగును ?

ఉ.—సత్తు, చిత్తు, ఆనందము, అద్వైతము ఇవి నాలుగు ఆత్మవిశేషణములు, మఱియు అసత్తు, జడము, దుఃఖము, ద్వైతము ఇవి నాలుగు అనాత్మవిశేషణములు; వానిలో అనాత్మగతదుఃఖము, ద్వైతము ఈ రెండు విశేషణములచే ఆత్మగతానందము, అద్వైతము ఈ రెండు విశేషణములు మూయఁబడి యున్నవి, దానివలన ఆత్మయందు నేను ఆనందరూపుఁడను, అద్వైతరూపుఁడను ఇట్టి ప్రతీతిగాదు; మఱే మనిన, నేను దుఃఖిని, ఈశ్వరునికంటె భిన్నుఁడను ఇట్టి ప్రతీతి కలుగుచున్నది; ఆత్మగత సత్తు, చిత్తు ఈ రెండువిశేషణములచే అనాత్మ

గతాసత్తు, జడము ఈ రెండువిశేషణములు మూయఁబడి యున్నవి; దానివలన అనాత్మమైన అహంకారాదులందు అసద్రూపమని, జడరూపమని ప్రతీతి గాదు; మఱే మనిన—సద్రూపమని, చిద్రూపమని ప్రతీతి కలుగుచున్నది; ఈరీతిగా ఆత్మకును, అనాత్మకును పరస్పరాధ్యాసము గలదు.

---

టిప్పణము.

1. మిథ్యాత్వనిశ్చయము బాధ యనఁబడును; అది శాస్త్రీయము, యౌక్తికము, అపరోక్షము.

2. జీవేశ్వరభేదము, జీవజీవులపరస్పరభేదము, జీవజడముల భేదము, జడజడముల పరస్పరభేదము, ఈశజడములభేదము ఇది పంచవిధభేదభ్రాంతి.

3. అంతఃకరణధర్మములయిన కర్తృత్వభోక్తృత్వములు ఆత్మయందు ప్రతీత మగుట కర్తృత్వభోక్తృత్వభ్రాంతి.

4. దేహాదులందు అహంతారూపము, గృహాదులందు మమతారూపము ఆత్మసంబంధప్రతీతి, లేక సజాతీయవిజాతీయస్వగతవస్తువుతో ఆత్మసంబంధప్రతీతి సంగభ్రాంతి.

5. క్షీరవికార మయిన దధివలె జీవజగత్తులు బ్రహ్మవికార మని ప్రతీతి వికారభ్రాంతి.

6. ముఖ్య మైన జీవేశ్వరభేదమునకు నిషేధముచే తదంతర్గత మైన నాలుగుభేదములకును సహజముగా నిషేధ మగుచున్నది.

7. పూర్వరూపమును విడిచి, అన్యరూపప్రాప్తి పరిణామ మనఁబడును; లేక, ఉపాదానముతో సమానసత్తగలదైన అన్యథారూపము పరిణామ మనఁబడును; దానిని వికార మనియుఁ జెప్పుచున్నారు.

8. తాను నిర్వికారరూపముగ స్థితమై, అవిద్యాకృతకల్పితకార్యమునకు ఆశ్రయ మయినది అధిష్ఠాన మనఁబడును; దానిని వివర్తోపాదాన మనియు నందురు.

9. అధిష్ఠానముతో విషమసత్త గలదై, అన్యథారూప మైనది వివర్తము; దానిని కల్పితకార్య మనియు, కల్పితవిశేష మనియు, అధ్యాస మనియు నందురు. దీని విశేషనిరూపణము శ్రీవిచారసాగర మందు గలదు.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - ప్రపంచమిథ్యాత్వవర్ణనానామికా షష్ఠకలా సంపూర్ణా.

---

# స ప్త మ క ల.

## ఆ త్మ వి శే ష ణ ము లు.

ప్ర.—ఆత్మయొక్క విశేషణములు ఎన్నివిధములు?

ఉ.—విధేయ నిషేధ్యభేదముచే 1-2 ద్వివిధములు. [విధేయ మనఁగా సాక్షాద్బోధకము, నిషేధ్య మనఁగా ప్రపంచనిషేధ ద్వారమున బోధకము.]

ప్ర.—విధేయవిశేషణము లేవి?

ఉ.—సత్తు, చిత్తు, ఆనందము, బ్రహ్మము, స్వయంప్రకాశము, కూటస్థము, సాక్షి, ద్రష్ట, ఉపద్రష్ట, ఏకము మొదలగునవి.

ప్ర.—ఆత్మ ఏరీతిగా సద్రూపము ?

ఉ.—జ్ఞానముచేతను, ఏప్రకారముచేతను దేని నివృత్తి కానేరదో, అది సత్తనఁబడును; ఎందువలన జ్ఞానాదులచేత ఆత్మను నివృత్తి కానేరదో, అందువలన ఆత్మ సద్రూపము.

ప్ర.—ఆత్మ యేరీతిగా చిద్రూపము ?

ఉ.—అలుప్తప్రకాశము చిత్తనఁబడును; ఎందువలన ఆత్మ అలుప్త ప్రకాశమో, అందువలన ఆత్మ చిద్రూపము.

ప్ర.—ఆత్మ యేరీతిగా ఆనందరూపము ?

ఉ.—పరమప్రేమకు విషయము ఆనంద మనఁబడును; అందఱికిని ఆత్మయందు పరమప్రేమ గలదు; కావున ఆత్మ ఆనందరూపము.

ప్ర.—ఆత్మ యేరీతిగా బ్రహ్మరూపము ?

ఉ.—ఆత్మ సచ్చిదానందరూప మని శ్రుతియుక్త్యనుభవములచే సిద్ధము; బ్రహ్మమును వేదమందు సచ్చిదానంద మని చెప్పఁబడినది; లేక, వ్యాపకపదార్థమునకు బ్రహ్మ మని పేరు; దేశముచే అంతము లేనిది వ్యాపక మనఁబడును; ఆత్మ బ్రహ్మముకన్న భిన్నమనిన, దేశముచే అంత మనవలయును; దేశముచే అంతము గలది కాలముచే అంతము గలది యని నియమము; అట్లయిన, ఆత్మ అనిత్యము అనఁగా— అనాత్మ యనవలయును; బ్రహ్మమును ఆత్మకన్న భిన్న మనిన, బ్రహ్మము అనాత్మ యగును; అనాత్మలయిన ఘటపటాదులు జడములు. అట్లు ఆత్మభిన్నబ్రహ్మమును జడ మగును; ఎందువలన ఆత్మ భిన్నము బ్రహ్మము కాదో, బ్రహ్మభిన్నము ఆత్మ కాదో, అందువలన ఆత్మ బ్రహ్మరూపము.

ప్ర.—ఆత్మ యేరీతిగా స్వయంప్రకాశము?

ఉ.—దీపమువలె తనప్రకాశమందు దేనియొక్కయు అపేక్ష లేక, సర్వమునకు ప్రకాశకము స్వయంప్రకాశ మనఁబడును, లేక, సదా అపరోక్షరూపమై, ఏజ్ఞానమునకును విషయము కానిది స్వయంప్రకాశ మనఁబడును, అటువంటిది ఆత్మ; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా కూటస్థము?

ఉ.—కమ్మరవానిదాగిలికి కూట మని పేరు; దానివలె అచలరూపముగ స్థిత మయినదానిని కూటస్థ మనవలయును; ఎట్లు కమ్మరవాఁడు అనేకాయుధములు చేసినను, దాగిలి కదలక యుండునో, అట్లు మనస్సు అను కమ్మరవాఁడు సంకల్ప వికల్పరూపము లైన అనేకాయుధములు చేసినను, ఆత్మ దాగిలివలె అచలముగా నుండును; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా సాక్షి?

ఉ.—ఉదాసీనమై, సమీపవర్తి యైన చైతన్యము సాక్షి యనఁబడును; లేక, అంతఃకరణాంతఃకరణావృత్తులందు వర్తమానచైతన్యమాత్రము సాక్షి యనఁబడును; అటువంటిది ఆత్మ, ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా ద్రష్ట?

ఉ.—చూచువాఁడు ద్రష్ట యనఁబడును; ఆత్మ సర్వమును ఎఱుఁగుచున్నాఁడు; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా ఉపద్రష్ట?

ఉ.—యజ్ఞశాలయందు యజ్ఞకర్మకర్తలగు ఋత్విక్కులు పదియాఱుగురు, పదునాఱవవాఁడు యజమానుఁడు, పదునేడవది యజమానపత్ని, పదునెనిమిదవవాఁడు ఉపద్రష్ట [సమీపవర్తి ద్రష్ట] వాఁడు

ఏదియు కార్యము చేయఁడు, వాఁడు చూడక ఏదియు కార్యమునడవదు; ఆప్రకారముగ స్థూలశరీరరూపయజ్ఞశాలయందు ప్రాణేంద్రియములు చేరి పదునైదుఋత్విక్కులు, పదునాఱవవాఁడు మనోరూపయజమానుఁడు, పదునేడవది బుద్ధిరూప యజమానపత్ని, వీరందఱు స్వస్వవిషయగ్రహణరూప యజ్ఞము చేయుచుండఁగా, వాని సమీపవర్తియై, ఎఱిఁగినవాఁడైన పదునెనిమిదవ ఆత్మ ఉపద్రష్ట; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా ఏకము?

ఉ.—ఆత్మకు సజాతీయ మయిన ఇంకొక్కాత్మ లేదు; ఈరీతిగా.

ప్ర.—నిషేధ్యవిశేషణము లేవేవి?

ఉ.—అనంతము, అఖండము, అసంగము, అద్వైతము, అజన్మము, నిర్వికారము, నిరాకారము, అవ్యక్తము మొదలగునవి.

ప్ర.—ఆత్మ యేరీతిగా అనంతము?

ఉ.—ఆత్మ వ్యాపక మగుటవలన దేశముచే అంతము లేనిది, నిత్యమగుటవలన కాలముచే అంతము లేనిది, సకలవస్తువులకు అధిష్ఠానమగుటవలన వస్తువుచే అంతము లేనిది; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా అఖండము?

ఉ.—ఆత్మ జీవేశ్వరాది పంచభేదరహితముగాను, సజాతీయాది భేదత్రయరహితముగాను వుండుటవలన.

ప్ర.—ఆత్మ యేరీతిగా అసంగము?

ఉ.—సంగ మని సంబంధమునకు పేరు, ఆత్మ సజాతీయాది సంబంధరహిత మగుటవలన.

ప్ర.—ఆత్మ యేరీతిగా అద్వైతము?

ఉ.—ద్వైతమయినట్టి ప్రపంచము గలదో, అది స్వప్నమువలె కల్పితము, సత్యము కాదు; ఈరీతిగా ద్వైతరహిత మగుటవలన.

ప్ర.—ఆత్మ యేరీతిగా అజన్మము?

ఉ.—జన్మము స్థూలదేహముయొక్క ధర్మము, అది సూక్ష్మదేహముయొక్కయు ధర్మము కాదు; అది ఆత్మయొక్కధర్మ మనుట ఏరీతిగాను సంభవింపదు; అట్లు ఆత్మజన్మము అంగీకరించినపుడు ఆత్మమరణమును అంగీకరింపవలసినది, అది సంభవింపదు; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా నిర్వికారము?

ఉ.—స్థూలదేహమునకు ఉత్పత్తి మొదలగు షడ్వికారములుగలవు, అవి ఆత్మకు లేవు; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా నిరాకారము?

ఉ.—స్థూలసూక్ష్మదీర్ఘహ్రస్వములు మొదలగు ఆకారములు జగత్తునందు గలవు; ఆత్మ ఇంద్రియములకును, మనస్సునకును విషయము కానందున ఆత్మ స్థూలము కాదు, వ్యాపక మగుటవలన సూక్ష్మ మనఁగా అణువును కాదు, అన్నిచోట్లలో పరిపూర్ణముగా నుండుటవలన దీర్ఘహ్రస్వములును కాదు; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా అవ్యక్తము?

ఉ.—అవ్యక్త మనఁగా అస్పష్టము, ఆత్మ మన ఇంద్రియాదులకు అగోచర మగుటవలన అస్పష్టము; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా అవ్యయము?

ఉ.—అవ్యయ మనఁగా ఖర్చులేనిది, కోటయందు ధాన్యము పోసియుటచే తక్కువ యగును, అట్లు ఆత్మ తక్కువ కాదు; ఈరీతిగా.

ప్ర.—ఆత్మ యేరీతిగా అక్షరము?

ఉ.—క్షరమనఁగా నాశము, ఆత్మ నాశరహితమగుటవలన అక్షరము.

ప్ర.—ఆత్మవిశేషణములు పరస్పరభిన్నములా అభిన్నములా ?

ఉ.—ఈవిశేషణములు గుణరూపానిత్యములైనపుడు, పరస్పరభిన్నము లగును, అవి లక్షణరూపనిత్యములు, కావున భిన్నములు కావు; చూడుము.— ఒకేయాత్మ నాశరహిత మగుటవలన సత్తనఁబడును, ప్రకాశరూప మగుటవలన చిత్తనఁబడును, పరమప్రేమమునకు విషయ మగుటవలన ఆనంద మనఁబడును.

---

## టిప్పణము.

1. "సధవా" శబ్దము విధవయొక్క నిషేధము చేసి, సౌభాగ్యవతికి సాక్షాద్బోధకము; అట్లు సదాదివిధేయవిశేషణములు అసత్వాది ప్రపంచధర్మముల నిషేధము చేసి, సాక్షాద్బ్రహ్మబోధకములు.

2. ఎట్లు అవిధవాశబ్దము విధవయొక్క నిషేధము చేసి, తద్విలక్షణ మైన సువాసినికి బోధకమో, అట్లు అనంతాది నిషేధ్యవిశేషణములు ప్రపంచధర్మ మైన అంతాదికముయొక్క నిషేధము చేసి తద్విలక్షణ మైన అనంతాదిరూపబ్రహ్మమునకు బోధకములు.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - ఆత్మవిశేషణవర్ణననామికా
సప్తమకలా సంపూర్ణా.



# అష్టమకల.

## సచ్చిదానందవిశేషవర్ణనము.

ప్ర.—సత్తనఁగా నేమి?

ఉ.—త్రికాలాబాధిత మయినది సత్తనఁబడును.

ప్ర.—చిత్తనఁగా నేమి?

ఉ.—త్రికాలమందును సర్వము నెఱిఁగినది చిత్తనఁబడును.

ప్ర.—ఆనంద మేది?

ఉ.—త్రికాలమందు పరమప్రేమమునకు విషయమైనది ఆనందము.

ప్ర.—నేను సత్తున్నా నని యేరీతిగ నెఱుఁగవలయును?

ఉ.—జాగ్రత్స్వప్నసుషుప్తులందును, ప్రాతస్సాయమ్మధ్యాహ్న కాలములందును, అహోరాత్రములందును, బాల్యతారుణ్యవార్ధకావస్థలందును, పూర్వోత్తర వర్తమానశరీరములందును నే నున్నాను; అందువలన నేను సత్తున్నా నని యెఱుఁగవలయును.

ప్ర.—నామరూపాత్మకవస్తువులను ఏ మని యెఱుఁగవలెను?

ఉ.—వానిని మిథ్య యని యెఱుఁగవలెను.

ప్ర.—సదసత్తులయొక్క నిర్ణయము యేరీతిగా నగును?

ఉ.—సదసత్తులనిర్ణయము అన్వయవ్యతిరేకయుక్తివలన నగును; ఎట్లనఁగా.—ఎవఁడు నేను జాగ్రత్తయం దున్నానో, వాఁడే నేను స్వప్నమందును, సుషుప్తియందును ఉన్నాను; అందువలన నేను సత్తని యెఱుఁగవలెను; మఱియు జాగ్రత్స్వప్నసుషుప్తులు నాయందు లేనందున అవి అసత్తు లని యెఱుఁగవలెను.

ప్ర.—నేను చిద్రూపుఁ డని యేరీతిగా నెఱుఁగవలెను?





ఉ.—సకలకాలములను, సకలావస్థలను నేను ఎఱుఁగుచున్నాను; అందువలన నేను చిద్రూపుఁడని ఎఱుఁగవలెను.

ప్ర.—నామరూపాత్మకవస్తువులను ఏమని ఎఱుఁగవలెను ?

ఉ.—వానిని జడము లని ఎఱుఁగవలెను.

ప్ర.—చిజ్జడములనిర్ణయము ఏరీతిగా నగును?

ఉ.—చిజ్జడముల నిర్ణయము అన్వయవ్యతిరేకరూప యుక్తిచేత నగును; ఎట్లనఁగా.—ఎవఁడు నేను జాగ్రత్తను ఎఱుఁగుచున్నానో, వాఁడే నేను స్వప్నసుషుప్తులను ఎఱుఁగుచున్నాను; అందువలన నేను చిద్రూపుఁడను; జాగ్రత్స్వప్నసుషుప్తులు నన్ను ఎఱుఁగవు; అందు వలన నవి జడరూపము లని ఎఱుఁగవలయును,

ప్ర.—నేను ఆనందరూపుఁ డని ఏరీతిగా నెఱుఁగవలయును ?

ఉ.—సకలకాలములందును, సకలావస్థలందును నేను పరమ ప్రియుఁ డగుటవలన నేను ఆనందరూపుఁ డని యెఱుఁగవలయును.

ప్ర.—నామరూపాత్మకవస్తువులను ఏ మని యెఱుఁగవలయును?

ఉ.—వానిని దుఃఖరూపము లని యెఱుఁగవలయును.

ప్ర.—సుఖదుఃఖములనిర్ణయము ఏరీతిగా నగును ?

ఉ.—సుఖదుఃఖముల నిర్ణయము అన్వయవ్యతిరేకరూప యుక్తిచే నగును; చూడుము.—ఎవఁడు నేను జాగ్రత్తులో ప్రియుఁడో, వాఁడే నేను స్వప్నమందును, సుషుప్తియందును ప్రియుఁడు; జాగ్రదాద్యవస్థలు వ్యభిచారు లగుటవలన 1 దుఃఖరూపములు [అవి భ్రాంతివలన సుఖరూపములుగాఁ గనఁబడు చున్నవి].

ప్ర.—నేను పరమప్రియుఁ డని ఏరీతిగా నెఱుఁగవలెను ?

ఉ.—పుత్త్రమిత్త్రినియందు ఏప్రీతిగలదో,అది పుత్త్రినిమిత్తమగుట

వలన ఆ మిత్త్రునికన్న పుత్త్రునియందు అధికప్రీతి గలదు; అట్లు ధనపుత్త్రకలత్త్రాదులందు యేప్రీతిగలదో, అది శరీరేంద్రియప్రాణమనశ్చిదాభాసులపరంపరగా ఆత్మకొఱకు గలదు; ఆ యాత్మయైన నేనో, సకలపదార్థములకంటె అధికప్రియుఁడుగా నున్నాఁడను; ఈరీతిగా.

ప్ర.—ప్రీతిసంబంధన్యూనాధికభావము ఏరీతిగా తెలియఁగవలెను?

ఉ.—ధనముకొఱకు పురుషుఁడు స్వదేశమును విడిచి, దేశాంతరము పోవుచున్నాఁడు; అందువలన ధనమే ప్రియమనవలయునా? పుత్త్రునకు రాజదండమైనపుడు ధన మిచ్చి పుత్త్రునివిడిపించుచున్నాఁడు; అందువలన పుత్త్రునినే ప్రియుఁడనవలయునా? దుర్భిక్షకాలమునందు పుత్త్రుని అమ్మి శరీరరక్షణము చేయుచున్నాఁడు; అందువలన శరీరమునే ప్రియ మనవలయునా? ఎపుడు యెవఁడు కొట్టుటకు వచ్చునో, అపుడు నేత్రనాసికాదీంద్రియములను మూయుచున్నాఁడు; అందువలన ఇంద్రియములే ప్రియము లనవలయునా? ప్రాణముతీసికొనుటకు రాజాజ్ఞ అయినపుడు తద్రక్షణము చేసి నాది చెవికొనుము, చెయ్యికొనుము అని ప్రార్థన చేయుచున్నాఁడు; అందువలన ప్రాణమే అత్యంతప్రియ మనవలయునా? వ్యాధిచే వ్యాకులమైనపుడు ప్రాణత్యాగమునకు సిద్ధమగుచున్నాఁడు; ఈరీతిగా చూచినపుడు ఆత్మయే సకలపదార్థములకంటె అత్యంతప్రియ మని సిద్ధమై, ఇతరపదార్థములు ఆత్మకన్న ఒకటికన్నొకటి తక్కువతక్కువప్రియము లని యెఱుఁగఁబడుచున్నవి.

---

టిప్పణము.

అవ్యభిచారిప్రీతి గలది ఆనందరూప మనఁబడును; జాగ్రదాద్యవస్థ గల యేయేకాలము ఆత్మయందు భాసమాన మగునో, అది

అధ్యాసముచే చిదాభాసద్వారమున ఆత్మకు ప్రియముగ భాసిల్లినను, అపుడు యితర కాలములు ప్రియములుగ భాసిల్లవు; అందువలన సర్వ కాలములందును వ్యభిచారిప్రీతి గలదు; ఆత్మయందో, అవ్యభిచారి ప్రీతి గలదు; అందువలన ఆత్మ ఆనందరూపము.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - సచ్చిదానందవిశేషవర్ణననామికా
అష్టమకలా సంపూర్ణా.

---

# నవమకల.

## అనిర్వాచ్యసిద్ధాంతవర్ణనము.



ప్ర.—బ్రహ్మాత్మవాణికి విషయము గానపుడు విధేయనిషేధ్యవిశేషణములచే యెట్లు చెప్పఁబడినది?

ఉ.—బ్రహ్మాత్మవిశేషణములలో సచ్చిదాది విధేయవిశేషణములు ప్రపంచమునకు నిషేధము చేసి బ్రహ్మమును సాక్షాద్బోధనము చేయుచున్నవి, మఱియు అనంతాసంగాది నిషేధ్యవిశేషణములు ప్రపంచమునకు నిషేధము చేయుచున్నవి; దానివలన తద్విలక్షణ మైన బ్రహ్మాత్మ అర్థముచే సిద్ధ మగుచున్నది.

ప్ర.—సచ్చిదాదివిశేషణములు ఏరీతిగా బ్రహ్మబోధకములు ?

ఉ.—సత్తనుటచే అసత్తుయొక్క నిషేధమై సద్రూపము ఎఱుఁగఁబడుచున్నది; అట్లె చిత్తనుటచే జడమునకు నిషేధమై చిద్రూపము, ఆనంద మనుటచే దుఃఖమునకు నిషేధమై ఆనందరూపము, వ్యాపక మనుటచే పరిచ్ఛిన్నమునకు నిషేధమై వ్యాపకరూపము, స్వయంప్రకాశ మనుటచే అప్రకాశపరప్రకాశములకునిషేధమై స్వయంప్రకాశరూపము, కూటస్థమనుటచే వికారమునకునిషేధమై నిర్వికారమయిన కూటస్థము, ఏక మనుటచే నానాత్వమునకు నిషేధమై ఏకము, సాక్షి ద్రష్టృప్రద్రష్టలనుటచే సాక్ష్యదృశ్యోపదృశ్యములకునిషేధమై సాక్షి ద్రష్టృప్రద్రష్టలు ఎఱుఁగఁబడు చున్నవి.

ప్ర.—అనంతాది నిషేధ్యవిశేషణములు ప్రపంచమునకు నిషేధము ఏరీతిగా జేయుచున్నవి ?

ఉ.—అనంత మనుటచే దేశకాలవస్తుకృత మయిన పరిచ్ఛేదమునకు నిషేధమయినది; అఖండమనుటచే పంచవిధభేదమునకును, త్రివిధభేదమునకును నిషేధమయినది; ఈరీతిగానే ఇతరము లైన నిషేధ్యవిశేషణములందును ఎఱుఁగవలయును.

ప్ర.—చెప్పఁబడినరీతిగా విశేషణములకు అర్థము చేయుటచే బ్రహ్మము అనిర్వాచ్య మని ఏరీతిగా సిద్ధ మగును ?

ఉ.—చెప్పఁబడినరీతిగా విశేషణార్థముకూడ ఆ విశేషణార్థము శక్తివృత్తిచే గ్రహింపక, లక్షణావృత్తిచే గ్రహించుటచే బ్రహ్మము అనిర్వాచ్య మని సిద్ధ మగును; ఎట్లనఁగా.—

1. మాయయొక్క సాపేక్షసత్యత, మఱియు బ్రహ్మముయొక్క నిరపేక్షసత్యత రెండుచేరి సత్పదమునకు వాచ్యము; మాయాసత్యతను విడిచి బ్రహ్మసత్యత కేవలము లక్ష్యము.

2. వృత్తిరూపజ్ఞానము, మఱియును చైతన్యరూపజ్ఞానము రెండు చేరి చిత్పదమునకు వాచ్యము, చైతన్యరూపజ్ఞానము లక్ష్యము.

3. విషయానందము, వాసనానందము, బ్రహ్మానందము చేరి ఆనందపదమునకు వాచ్యము, బ్రహ్మానందము లక్ష్యము.

4. ఆకాశమాయాదు లందలి సాపేక్షవ్యాపకత, మఱియు బ్రహ్మమందలి నిరపేక్షవ్యాపకత చేరి వ్యాపకపదమునకు వాచ్యము, బ్రహ్మనిష్ఠవ్యాపకత లక్ష్యము.

5. సాభాసబుద్ధియందలి సాపేక్షస్వయంప్రకాశత, మఱియు చైతన్య మందలి నిరపేక్షస్వయంప్రకాశత చేరి స్వయంప్రకాశపద మునకు వాచ్యము, చైతన్యస్వయంప్రకాశత లక్ష్యము.

6. రజ్జ్వాదులందలి సాపేక్షనిర్వికారత, మఱియును చైతన్య మందలి నిరపేక్షనిర్వికారత చేరి కూటస్థపదమునకు వాచ్యము, చైతన్యనిరాకారత లక్ష్యము.

అనుక్తము లయిన విధేయవిశేషణములందును యీరీతిగానే లక్ష్యార్థము నెఱుఁగవలయును; అట్లే అసదాదు లయిన నిషేధ్యవిశేషణములందును యీరీతిగానే లక్షణోపయోగము చేయవలయును.

ప్ర.—ఈరీతిచే విశేషణార్థము చేయుటవలన ప్రయోజన మేమి?

ఉ.—ఈరీతిచే అర్థము చేయుటవలన బ్రహ్మము మనోవాణుల కగోచర మను శ్రుతితో అవిరోధ మగును, గుణక్రియాజాతిసంబంధ ములు మొదలగు మనోవాణులకు ప్రవృత్తివిషయధర్మములు యేవే గలవో అవి బ్రహ్మమందు లేవు, అందువలన శ్రుతి బ్రహ్మము మనో వాణుల కగోచర మని పలికెను; లేక ఏదేదిభాషణమో అది ద్వైతో

ముచే కలుగును, అద్వైతముచే కలుగదు; ఈరీతిచే అర్థము చేయుట వలన సుఖముగా అద్వైతబోధ మగుచున్నది.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - అనిర్వాచ్యసిద్ధాంతవర్ణననామికా నవమకలా సంపూర్ణా.

---

# దశమకల.

## సామాన్యవిశేషచైతన్యములు.

ప్ర.—విశేషచైతన్య మేది?

ఉ.—అంతఃకరణమందును, తద్వృత్తియందును వర్తమానచిత్ప్రతిబింబరూపచిదాభాసమును విశేషచైతన్య మందురు.

ప్ర.—చిదాభాసుని లక్షణ మేది?

ఉ.—చైతన్యలక్షణమునకు వేఱయి చైతన్యమువలె కనఁబడునది.

ప్ర.—చిదాభాసము విశేషచైతన్య మని యెందుకు చెప్పఁబడినది?

ఉ.—అల్పదేశమందు, అల్పకాలమందు గలది విశేష మనఁబడును; చిదాభాసము అంతఃకరణదేశమందు, జాగ్రత్స్వప్నకాలములందు, లేక అజ్ఞానకాలమందుమాత్రము గలుగుటవలన విశేషము. 1

ప్ర.—విశేషచైతన్యమునకు దృష్టాంత మేది ?

ఉ.—సూర్యప్రకాశము సర్వత్ర సమానముగ నుండినను ప్రతిబింబము సర్వత్ర గానేరదు, ఎచ్చట జలదర్పణోపాధులు గలవో, అచ్చట మాత్రమగును; అట్లు అస్తిభాతిప్రియరూప మగు సామాన్యచైతన్యము సర్వత్ర సమానముగ నుండినను, దానివలన వచనగమనాది వ్యవహారము జరుగదు; ఎచ్చట అంతఃకరణోపాధి కలదో అచ్చట విశేషచైతన్యము గలదు; దానివలన వ్యవహారము జరుగును.

ప్ర.—విశేషచైతన్య మెఱుఁగుటచే ఏమి నిశ్చయ మగును ?

ఉ.—కర్తృత్వభోక్తృత్వాదు లైన ధర్మములు విశేషచైతన్య మందు గలవు; అవి నేను కాను, అవి నావి కావు, మ ఱే మనిన, అవి నాయందు కల్పితములు; వానియొక్క అధిష్ఠాన మయిన సామాన్యచైతన్య బ్రహ్మము నేను; ఈ నిశ్చయ మగును.

ప్ర.—దేనిని సామాన్యచైతన్య మందురు ?

ఉ.—సర్వత్ర పరిపూర్ణమై, సకలనామరూపాధిష్ఠానమై, అస్తిభాతిప్రియరూప మైన నిర్వికారబ్రహ్మమును సామాన్యచైతన్య మందురు. 2

ప్ర.—సామాన్యచైతన్యమునకు దృష్టాంత మేది ?

ఉ.—ఒకే రజ్జువునందు నానాపురుషులకు సర్పదండమాలాజలధారలు గనఁబడుభ్రాంతియందు సామాన్యవిశేషము లగు రెండంశములు గలవు; వానిలో ఈ సర్పము, ఈ దండము, ఈరీతిగా సర్పాదివిశేషాంశమునందు " ఈ " అను సామాన్యాంశము వ్యాపకము; అది భ్రాంతికాలమునందు సర్పాదిరూపమునను, భ్రాంతినాశానంతరము రజ్వాదిరూపమునను భాసిల్లును; అందువలన అది అవ్యభిచారియై 3 సత్యముగ నున్నది; మఱియును వ్యభిచారి యైన సర్పాదివిశేషాంశ

ము కల్పితముగా నున్నది.

భూతభౌతికము లయిన సకలపదార్థములందు పంచాంశములు గలవు:— అస్తి, భాతి, ప్రియము, నామము, రూపము.—

ఘటము గల దని అస్తి, ఘటము భాసిల్లు నని భాతి, ఘటము వుపయోగింపఁగల దని ప్రియము, ఘట మని రెండక్షరములు నామము, కంబుగ్రీవాకారము రూపము; అట్లు భూతకారణ మైన అజ్ఞానము గల దని అస్తి, అజ్ఞానము భాసిల్లు నని భాతి, అజ్ఞాని జీవునికి అజ్ఞానకార్య మైన ప్రపంచమును సుషుప్తిగతాజ్ఞానమును ప్రియము, అజ్ఞాన మని మూఁడక్షరములు నామము, ఆవరణవిక్షేపశక్తి గల అనాదిభావరూప పదార్థ మని రూపము.

అజ్ఞానము పరిత్యజించినపుడు.—ఏమియు లే దని ప్రతీతికి విషయ మగున అభావము గల దని అస్తి, అభావము ప్రతీత మగుచున్న దని భాతి, శూన్యవాదికి అభావము ప్రియము, అభావ మని మూఁడక్షర ములు నామము, నిషేధముఖప్రతీతికి విషయ మని రూపము.

ఈరీతిగా సకలనామరూపములందు అవ్యభిచారి యైన, తదధిష్ఠానము సామాన్యచైతన్యముగ నున్నది; ఘటముల నామరూపములు పటమునందు లేవు; పటములనామరూపములు ఘటమందు లేవు; కావున పరస్పరవ్యభిచారు లైన ఆ నామరూపములు మిథ్య.

ప్ర.—సామాన్యచైతన్యబ్రహ్మమునకు సకలముకన్న సూక్ష్మత, మఱియు వ్యాపకత యేరీతిగా యెఱుఁగవలయును?

ఉ.—ఏదేది కార్యమో, అది స్థూలము పరిచ్ఛిన్నము; ఏదేది కారణమో, అది సూక్ష్మము వ్యాపకము; బ్రహ్మము సకలమునకు కారణ మగుటవలన సూక్ష్మము, మఱియు వ్యాపకము; ఎట్లనఁగా.—

సముద్రజలముకన్న సముగు, ఉప్పు కఠోరపరిచ్ఛిన్నము లగుట వలన కార్యమయిన పృథ్వికన్న కారణ మయిన జలము సూక్ష్మ మని, వ్యాపక మని సిద్ధము.

ఈరీతిగానే సకలభూతములకన్న సూక్ష్మము, మఱియు వ్యాపకము ఆకాశము; ఆకాశమునకు కారణ మగుటవలన అజ్ఞానము ఆకాశముకన్న సూక్ష్మము, మఱియు వ్యాపకము; ఆ యజ్ఞానమునకు అధిష్ఠానకారణము చైతన్య మగుటవలన చైతన్యము దానికన్నను సూక్ష్మము, మఱియు వ్యాపకము. లేక, అజ్ఞానము మనస్సుచేత గ్రాహ్యము కాదైనను, అనుభవరూపలింగమున అనుమానముచేత యెఱుంగఁబడుచున్నది; చైతన్యము స్వయంప్రకాశ మగుటవలన యే ప్రమాణమునకును విషయము కాదు; కావున చైతన్యము అజ్ఞానముకన్న సూక్ష్మము, మఱియు వ్యాపకము.

ప్ర.—ఈరీతిగా సామాన్యచైతన్య మెఱింగినపుడు ఏనిశ్చయమగును.

ఉ.—అస్తిభాతిప్రియరూపసామాన్యచైతన్యబ్రహ్మము నేను, నేను అస్తిభాతిప్రియ సామాన్య చైతన్యబ్రహ్మము; ఈ నిశ్చయ మగును.

ప్ర.—ఈ నిశ్చయము చేయుటచే నేమి యగును ?

ఉ.—ఈనిశ్చయముచే అజ్ఞాననివృత్తిబ్రహ్మప్రాప్తిరూపమోక్షము.

---

టిప్పణము.

1. అధిష్ఠానము, అధ్యస్తము యీ భేదమువలన విశేషము ద్వివిధము; వానిలో,—భ్రాంతికాలమందు దేని ప్రతీతి గానేరదో, దేని ప్రతీతివలన భ్రాంతినివృత్తి యగునో, అది అధిష్ఠానరూపవిశేషము; మఱియు భ్రాంతికాలమందు దేనిప్రతీతి యగునో, అధిష్ఠానజ్ఞానకాల

మందు ప్రతీతి గాఁ నేరదో, అది అధ్యస్తరూపవిశేషము; దానిని కల్పిత విశేష మని యందురు.

2. సుషుప్తిమూర్ఛాసమాధులకు ప్రకాశకము సామాన్యచైతన్యము, త్రిపుటీప్రకాశకుఁ డైన సాక్షి సా... జాగ్రత్స్వప్నాద్యవస్థలకు ప్రకాశకము సా... వృత్తులసంధి ప్రకాశకము సా... అంగుల్యగ్రభాగమునకు ప్రకాశకము సా... వృత్తిదేశాంతరగత మైనపుడు మధ్యభాగమునకు ప్రకాశకము సా... వృత్తిసూర్యచంద్రాకార మైనపుడు మధ్యభాగమునకు ప్రకాశకము సా... "నేను నన్ను నెఱుఁగను" ఈప్రకారముగ అజ్ఞానవిశిష్టుఁ డైన తనకు ప్రకాశకము సా...

3. ఒకచోట వుండినపుడు యింకొక్కచోట లేదు; ఒకప్పుడు వుండిన యింకొకప్పుడు లేదు; ఆ వస్తువు వ్యభిచారి యనఁబడును.

ఇతి శ్రీ విచారచంద్రోదయే - సామాన్యవిశేషచైతన్యవర్ణననామికా దశమకలా సంపూర్ణా.



# ఏకాదశకలం.

## తత్త్వంపదార్థముల ఐక్యనిరూపణము.

---

ప్ర.—తత్పద మన నేమి?

ఉ.—సామవేదఛాందోగ్యోపనిషత్తుల షష్ఠప్రపాఠకమందు శ్వేతకే

తను పుత్త్రునిగూర్చి వుద్దాలకమునిచే నుపదేశము చేయఁబడిన తత్త్వ మసి మహావాక్యమందలి ప్రథమపదము.

ప్ర.—త్వంపద మన నేమి ?

ఉ.—అదే మహావాక్యమందలి ద్వితీయపదము.

ప్ర.—వాచ్యార్థలక్ష్యార్థము లేవి ?

ఉ.—శబ్దమునకు అర్థముతో సంబంధ మేది గలదో, అది శబ్దవృత్తి యనఁబడినది; అది శక్తివృత్తి, లక్షణావృత్తి యని ద్వివిధము —

స్వార్థసామర్థ్యము గల శబ్దమునకు అర్థముతో సాక్షాత్సంబంధము శక్తివృత్తి యనఁబడును; శక్యార్థద్వారమున శబ్దమునకు అర్థముతో పరంపరాసంబంధము లక్షణావృత్తి యనఁబడును; శక్తివృత్తిచే యెఱిఁగిన అర్థము శక్యార్థ మని [వాచ్యార్థ మని] లక్షణావృత్తిచే యెఱిఁగిన అర్థము లక్ష్యార్థ మని చెప్పఁబడినది.

ప్ర.—లక్షణావృత్తి యెన్నివిధములు ?

ఉ.—జహత్తు, అజహత్తు, జహదజహత్తు అని త్రివిధము.—

1. సంపూర్ణవాచ్యార్థత్యాగమై, వాచ్యార్థసంబంధికి గ్రహణ మగుచోట జహల్లక్షణ యనఁబడును; ఎట్లనఁగా.—“గంగాయాం ఘోషః” అను వాక్యములో దేవనదీప్రవాహమందు గోపాలగ్రామ స్థితికి అసంభవ మగుటవలన వాచ్యార్థమైన నదీప్రవాహమునకు త్యాగము చేసి, తత్సంబంధితటమునకు గ్రహణము గలదు.

2. వాచ్యార్థత్యాగము చేయక, తత్సంబంధికి గ్రహణమగుచోట అజహల్లక్షణ యనఁబడును. ఎట్లనఁగా.—“శోణోధావతి” అను వాక్యములో శోణవర్ణమందు పరుగెత్తుధర్మము సంభవింపనందున ఆరక్త వర్ణము గల అశ్వమునకు గ్రహణము గలదు.

3. వాచ్యార్థమందు విరోధమగుచోట జహదజహల్లక్షణ యనఁబడును; ఎట్లనఁగా.— "సోయం దేవదత్తః" అను వాక్యమునం దూరదేశ పూర్వకాలములందు చూడఁబడిన దేవదత్తుఁడు ఏతద్దేశవర్తమానకాలములందు చూడఁబడునట్లు వాచ్యార్థముచే అర్థమై పరస్పరవిరోధము గలుగుటచే దేశకాలరూప మగు ఒకభాగము పరిత్యజించి, దేవదత్తరూప మైన ఒకభాగమునకు గ్రహణము గలదు.

ప్ర.—త్రివిధలక్షణలందు మహావాక్యమందు 1 ఏది ఉచితము ?

ఉ.—జహల్లక్షణచోట సంపూర్ణవాచ్యార్థత్యాగమగుటచే తత్త్వంపదముల వాచ్యార్థములందు ప్రవిష్టులైన బ్రహ్మచైతన్యము, సాక్షిచైతన్యము పోయి, వానికన్న భిన్న మైన అసజ్జడదుఃఖరూపప్రపంచమునకు గ్రహణమగును; అజహల్లక్షణచోట వాచ్యార్థమందు ఏమియు త్యాగము కాక పోవుటవలన పదద్వయ వాచ్యార్థస్థిత మైన విరోధమునకు పరిహారముగాదు; కనుక మహావాక్యార్థమందు ఈద్వివిధలక్షణలును ఉచితములు కావు; భాగత్యాగలక్షణచోట విరోధిభాగమునకు త్యాగమై అవిరోధిభాగమునకు గ్రహణ మగుటచే తదంగీకారమే ఉచితము. 2

ప్ర.—తత్పదమునకు వాచ్యార్థ మేది ? లక్ష్యార్థ మేది ?

ఉ.—అవ్యాకృత మైనమాయయే ఈశ్వరుని దేశము, ఉత్పత్తిస్థితిప్రలయములు ఈశ్వరుని కాలము, సత్త్వరజస్తమోగుణములు సృష్టిసామగ్రి, విరాడ్ హిరణ్యగర్భ అవ్యాకృతులు ఈశ్వరుని శరీరములు, వైశ్వానర సూత్రాత్మాంతర్యాములు ఈశ్వరత్వమునకు అభిమానులు "నేను ఒకఁడయినవాఁడను బహురూప మగుదును" అను ఇచ్ఛనుంచి జీవరూపముచే ప్రవేశము చేయుటకు ఈశ్వరుని కార్యము, సర్వశక్తి సర్వజ్ఞత వ్యాపకత ఏకత స్వతంత్రత సమర్థత పరోక్షత మాయోపాధి ఇవి యెనిమిది ఈశ్వరునిధర్మములు, ఇవన్ని సహితముగ మాయ, మాయయం

దలి చిదాభాసము, మఱియు తదధిష్ఠాన మైన బ్రహ్మము ఇవన్నియు చేరిన ఈశ్వరుఁడు తత్పదమునకు వాచ్యార్థము; మఱియు సకలధర్మ సహితముగ మాయాచిదాభాసుల పరిత్యాగముచే పరిశేషమై ఈశ సాక్షి యైన బ్రహ్మము తత్పదమునకు లక్ష్యార్థము.

ప్ర — బ్రహ్మమునకును, ఈశ్వరునికిని పరీతిగా ధ్యాసము ?

ఉ. — బ్రహ్మమందు గల సత్యతయొక్క సంసర్గము ఈశ్వరునియందు అధ్యస్త మగుటవలన ఈశ్వరుఁడు సత్యుఁ డని, ఈశ్వరునియందు గల కారణతయొక్క స్వరూపము బ్రహ్మమందు అధ్యస్త మగుటవలన బ్రహ్మ ము జగత్కారణ మని ప్రతీత మగుచున్నది.

ప్ర. — త్వంపదమునకు వాచ్యార్థ మేది ? లక్ష్యార్థ మేది ?

ఉ. — నేత్రకంఠహృదయములు జీవునిదేశము, జాగ్రత్స్వప్నసుషు ప్తులు జీవునికాలము, స్థూలసూక్ష్మకారణములు జీవునిభోగసామగ్రి, వే పేళ్లు గలవి మూఁడును జీవునిశరీరములు, విశ్వతైజసప్రాజ్ఞులు జీవ ముసకు అభిమానులు, జాగ్రత్తనుండి మోక్షపర్యంతము సంసారము వునికార్యము, అల్పశక్తి అల్పజ్ఞత పరిచ్ఛిన్నత అనేకత పరాధీనత సమర్థత అపరోక్షత అవిద్యోపాధి ఇవి యెనిమిది జీవునిధర్మములు ఇ న్నిచేరిన దైన అవిద్య, దానియందు ప్రతిబింబము, మఱియు కూట స్థుఁడు ఇవన్నిచేరినజీవుఁడు త్వంపదమునకు వాచ్యార్థము, మఱియును వీనిలో సహపరివారముగ చిదాభాసుని పరిత్యాగమై, పరిశేష మయిన కూటస్థాత్మ త్వంపదమునకు లక్ష్యార్థము.

ప్ర. — కూటస్థునకు, చిదాభాసునకు పరస్పరాధ్యాసము ఎట్లు ?

ఉ. — కూటస్థునిసత్యతయొక్క తాదాత్మ్యసంబంధము చిదాభాసు నియందధ్యస్తమగుటవలన చిదాభాసము సత్యముగాప్రతీతమాయెను;

మఱియు చిదాభాసునియొక్కయు, తద్ధర్మము లయిన కర్తృత్వాదుల యొక్కయు స్వరూపములు కూటస్థునియందు దధ్యస్తము లగుటవలన కూటస్థుఁడు కర్త భోక్తగా ప్రతీతుఁడాయెను.

ప్ర.—తత్త్వంపదార్థములకు ఏకత ఎట్లు సంభవించును?

ఉ.—యద్యపి తత్పదత్వంపదవాచ్యార్థములయిన ఈశ్వరజీవులందు పరస్పరభేదము గలదు; తథాపి లక్ష్యార్థము లయిన బ్రహ్మాత్మలకు ఏకత సంభవించును.

ప్ర.—నేను బ్రహ్మ మని జ్ఞానము ఎవ్వని కగును?

ఉ.—ఆ జ్ఞానము చిదాభాసున కగును.

ప్ర.—బ్రహ్మభిన్నమయినట్టి చిదాభాసము నేను బ్రహ్మ మని యేరీతిగా ఎఱుఁగును?

ఉ.—జీవత్వమున కధిష్ఠాన మైన కూటస్థునికి బ్రహ్మముతో ముఖ్యాభేదము, బుద్ధిసహితచిదాభాసునికి బ్రహ్మముతో స్వరూపబాధచే అభేదము గలదు; అందువలన చిదాభాసము అహంశబ్దలక్ష్యార్థ మయిన కూటస్థరూపముగా తన్ను ఎఱుఁగుచున్నది.

---

టిప్పణము.

1. "తత్త్వమసి, ప్రజ్ఞానమానందం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ" అను సక్రమముగా సామవేద ఋగ్వేద యజుర్వేదాథర్వవేదములకు మహావాక్యములు గలవు; అందఱియందును తత్త్వమసి యందు వలెనే లక్ష్యార్థగ్రహణము చేయవలయును.

2. "సోఽయం దేవదత్తః" గంగాస్నానమునకైన దేవదత్తుఁడని పేరుగల వాఁడు కాశీపట్టణాధిపతి. వాఁడొక యాత్రానిమిత్తముగాఁడు తన

మిత్రసహితముగ చూచిన పిమ్మట ఆరాజు రాజ్యభ్రష్టుఁడై, కౌపీనపరిధానము చేసి, ఘుమడకాయ చెంబుతీసికొని, ఆంధ్రదేశమందు సంచరించుచుండఁగా, ఆయాత్రావాసిపురుషుఁడు మరల వానిఁజూచి, తన మిత్రునితో పలికెను; అప్పుడు మిత్రుఁడు:—అది కాశీదేశము ఇది ఆంధ్రదేశము, అది ఈశ్వరనామసంవత్సరము ఇది రాక్షసనామసంవత్సరము అది గజము మొదలగు ఐశ్వర్యము, ఇది కౌపీనము మొదలగు దారిద్ర్యము ఉండఁగా, వాఁడే ఇతఁడు, ఎట్లగునని అడిగెను; అప్పుడు యాత్రావాసి అనెను:—ఆదేశకాలములు, ఈదేశకాలములు, ఆసామగ్రి, ఈ సామగ్రి విడిచి, కేవలదేవదత్తుని చూడు మఱి! ఒకఁడే పురుషుఁడు.

ఆప్రకారముగ జీవేశ్వరస్థితములైన అవిద్యామాయోపాధులను, అల్పజ్ఞతాసర్వజ్ఞత్వాది తద్ధర్మములను విడిచి, చేతనమాత్రబ్రహ్మాత్మలకు ఏకత సంభవించును; అందువలన ఏది బ్రహ్మమో అది నేను, యేది నేనో అది బ్రహ్మము, ఇట్టి నిశ్చయము చేయవలయును; ఈ నిశ్చయమునకే తత్త్వజ్ఞానమని పేరు, ఈ తత్త్వజ్ఞానముచే మోక్షము.

౩. మాయ, మఱియు మూఁడుగుణములు ఒకేపదార్థముగ నుండినను, ఈశ్వరసంబంధదేశవస్తుశరీరములకు ఏకత గలదు; కులాలునికి ఘటము చేయుటకు మృత్తికారూపపృథ్వీదేశము గలదు; మృత్పిండము వస్తువు గలదు; అస్థిమాంసాదులయిన పృథ్వీభాగము శరీరము గలదు; ఈ మూఁడింటికి ఏకతయందు అసంభవము లేనట్లు.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - తత్త్వంపదార్థైక్యనిరూపణనామికా

ఏకాదశకలా సంపూర్ణా.

# ద్వాదశకలం.

## జ్ఞానికృతకర్మమునకు నివృత్తి.

ప్ర.—కర్మ మనున దేమి ?

ఉ.—శరీరవాణీమానసముల క్రియ కర్మ మనఁబడును.

ప్ర.—కర్మము ఎన్నివిధములు ?

ఉ.—సంచితప్రారబ్ధక్రియమాణముల భేదముచే మూఁడువిధములు.

ప్ర.—సంచితకర్మ మనున దేమి ?

ఉ.—అనేకజన్మములందు సంగ్రహింపఁబడిన కర్మము.

ప్ర.—ప్రారబ్ధకర్మ మేది ?

ఉ.—సంచితకర్మరాశిలో పరిపక్వమై ఈజన్మమునకు, లేక అనేక జన్మములకు హేతువైన ఈశ్వరసంకల్పముచే నియమింపఁబడినకర్మము.

ప్ర.—క్రియమాణకర్మ మేది ?

ఉ.—జ్ఞానప్రాప్తికి పూర్వోత్తరము జ్ఞానిశరీరమందు చేయఁబడిన కర్మము [ఆగామికర్మము].

ప్ర.—జ్ఞానికృతకర్మమునకు నివృత్తి యేరీతిగా నగును ?

ఉ.—1 జ్ఞానముచే అజ్ఞానసంబంధావరణాంశమునకు నివృత్తియై, అందనే తదాశ్రితమయిన సంచితకర్మమునకు నివృత్తియగుచున్నది; 2 జ్ఞానమునకు పూర్వోత్తరమయిన క్రియమాణకర్మము "నేను అకర్త అభోక్త అసంగబ్రహ్మము" అను నిశ్చయముయొక్క బలముచే జలస్థితమైన కమలపత్రన్యాయమున జ్ఞానికి అంటదు; లేక, క్రియమాణములగు శుభాశుభకర్మములు జ్ఞానియొక్క సేవకులు, నిందకులు క్రమముగా గ్రహణము చేయుచున్నారు [ఇది అర్థవాదపక్షము]; 3 అజ్ఞాన

సంబంధ విక్షేపశక్త్యాశ్రిత మయిన ప్రారబ్ధకర్మమునకు నివృత్తిభోగ ముచే నగును; ఈరీతిగా జ్ఞానికి కర్మనివృత్తి యగును.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - జ్ఞానికర్మనివృత్తి వర్ణననామికా ద్వాదశకలా సంపూర్ణా.



# త్రయోదశకలం.

## సప్తజ్ఞానభూమికలు.



ప్ర.—సర్వజ్ఞానులకు నిశ్చయము ఏకముగా నుండఁగా స్థితియందు భేదము ఎందుకు కనఁబడుచున్నది ?

ఉ.—స్థితియందు భేదము జ్ఞానభూమికలభేదముచే కనఁబడుచున్నది.

ప్ర.—జ్ఞానభూమికలు ఎన్ని ?

ఉ.—శుభేచ్ఛ, సువిచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావిని, తురీయగ ఇవి యేడు జ్ఞానభూమికలు.—

1. పూర్వజన్మమందు, లేక ఈజన్మమందు చేయఁబడిననిష్కామ కర్మోపాసనలచే శుద్ధ మయిన మనస్సు గలవానికి వివేకాదిసాధనములై, ఆత్మజ్ఞానమందు తీవ్రేచ్ఛ గలుగుట శుభేచ్ఛ.

2. గురుముఖ వేదాంతవాక్యశ్రవణము చేసి, మననముతో అనునానాయుక్తులతో విచారము చేయుట సువిచారణ.

3. స్వరూపసాక్షాత్కారమునకై అను శ్రవణమననముల ద్వార మున నిర్ణీత మయిన బ్రహ్మాత్మైక్యరూపార్థమును నిరంతరముగా చింత నము చేయునది తనుమానస.

4. శ్రవణ మనన నిదిధ్యాసనములచే సంశయవిపర్యయరహిత ముగా నిర్వికల్పస్థితియగుటచే శుద్ధసత్త్వగుణముయొక్క, లేక స్వరూప సత్తయొక్క సంప్రాప్తి సత్త్వాపత్తి.

5. అభ్యాసములచే నిర్వికల్పసమాధికి పరిపక్వతచే దేహమం దలి అహంతామమతలు సర్వథాకలితములై, ప్రపంచమునందు అనా సక్తి యగుట అసంసక్తి.

6. బ్రహ్మాకారవృత్తియందు రమించుటవలన దేహాదులైన సకల పదార్థములందు అప్రతీతి పదార్థాభావిని.

7. చతుర్థ పంచమభూమికలువలె భావరూపమునను, షష్ఠభూ మికవలె అభావరూపమునను జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపత్రిపుటికి దేనిలో ప్రతీతి గానేరదో, అటువంటిది తురీయపద మయిన అధిష్ఠానమునందు ఉత్థానరహిత మగు మనస్సుయొక్క స్థితి తురీయగ.

ప్ర.—ఈ యేడుభూమికలు దేనికి సాధనములు?

ఉ.—ప్రథమ ద్వితీయ తృతీయభూమికలు తత్త్వజ్ఞానమునకు సాధ నములు, చతుర్థభూమిక జీవన్ముక్తి విదేహముక్తులకు సాధనము, పం చమ షష్ఠ సప్తమభూమికలు జీవన్ముక్తిసంబంధ స్వరూపసుఖమునకు సాధనము.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - జ్ఞానభూమికావర్ణననామికా
త్రయోదశకలా సంపూర్ణా.

# పంచదశకలం.

## వేదాంతప్రమేయవర్ణనము.

---

ప్ర.—మోక్షమునకు స్వరూప మేది?

ఉ.—కార్యసహితాజ్ఞానరూపానర్థమునకు నివృత్తి, మఱియు పరమానందరూపబ్రహ్మమునకు సంప్రాప్తి మోక్షమునకు స్వరూపము.

ప్ర.—మోక్షమునకు ముఖ్యసాధన మేది?

ఉ.—బ్రహ్మాత్మైక్యాపరోక్షజ్ఞానము ముఖ్యసాధనము.

ప్ర.—ఆత్మనకు స్వరూపము ఎట్లు?

ఉ.—దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యజ్ఞానశూన్యములకంటె భిన్నమై అకర్తృభోక్తృసంగవ్యాపకచైతన్యము ఆత్మనకు స్వరూపము.

ప్ర.—బ్రహ్మమునకు స్వరూపము ఎట్లు?

ఉ.—నిష్ప్రపంచాసంగపరిపూర్ణచైతన్యము బ్రహ్మస్వరూపము.

ప్ర.—బ్రహ్మాత్మలకు యేకత యేరీతిగాఁ గలదు?

ఉ.—సదావిద్యమానచిదానందముగా బ్రహ్మాత్మలకు ఏకత గలదు.

ప్ర.—జ్ఞానమునకు స్వరూప మేది?

ఉ.—జీవబ్రహ్మముల కభేదనిశ్చయజ్ఞానమునకు స్వరూపము.

ప్ర.—జ్ఞానమునకు అంతరంగసాధనములు ఏవి? దానిలోను సాక్షాదంతరంగసాధన మేది?

ఉ.—వివేకము, వైరాగ్యము, శమాదిషట్సంపత్తి, ముముక్షుశ్రవణము, మననము, నిదిధ్యాసనము, తత్త్వంపదార్థశోధనము, ఇవి యెనిమిది అంతరంగసాధనములు; వానిలోను తత్త్వంపదార్థశోధనము సాక్షాదంతరంగసాధనము.

ప్రం.—జ్ఞానమునకు బహిరంగసాధనము లేవి ?

ఉ.—నిష్కామకర్మోపాసనలు మొదలు బహిరంగసాధనములు.

ఇతి శ్రీ విచారచంద్రోదయే - వేదాంతప్రమేయవర్ణననామికా
పంచదశకలా సంపూర్ణా.

---

# షోడశకల.

## వేదాంతపదార్థసంజ్ఞ.

### 2 ద్వివిధపదార్థములు.

అధ్యాసము 2.—అర్థాధ్యాసము, జ్ఞానాధ్యాసము.

అహంకారము 2.—శుద్ధము [కూటస్థాత్మను గురించి], అశుద్ధము [దేహాద్యవాత్మను గురించి].

అహంకారము 2.—సామాన్యము [కేవలము నే నని స్ఫురణము], విశేషము [నామజాత్యాదిదేహధర్మములను గురించి] నే ననిస్ఫురణము].

అహంకారము 2.—ముఖ్యము [దేహాది సంఘాతసహిత కూటస్థుని గూర్చి నే నని స్ఫురణము], అముఖ్యము [కేవలకూటస్థునిగూర్చి నే నని స్ఫురణము].

అజ్ఞానము 2.—సమష్టి [వ్యాపక చైతన్యమునకు ఆచ్ఛాదక మైన మూలాజ్ఞానము], వ్యష్టి [ఘటాద్యవచ్ఛిన్న చైతన్యము కాచ్ఛాదక మైన తూలాజ్ఞానము].

అజ్ఞానశక్తి 2.—ఆవరణహేతువు, విక్షేపహేతువు.

బ్రహ్మము 2.—సగుణము, నిర్గుణము.

శబ్దము 2.—వర్ణరూపము, ధ్వనిరూపము.

సంపత్తి 2.—దైవి, ఆసురి.

సమాధి 2.—సవికల్పము, నిర్వికల్పము.

## 3 త్రివిధపదార్థములు.

అధ్యాత్మాది 3.—అధ్యాత్మము [ఇంద్రియము], అధిదైవము [దేవత], అధిభూతము [విషయము].

అంతఃకరణదోషములు 3.—మలము, విక్షేపము, ఆవరణము.

ఆత్మలు 3.—మిథ్యాత్మ [స్థూల సూక్ష్మసంఘాతము], గౌణాత్మ [పుత్త్రుఁడు], ముఖ్యాత్మ [సాక్షి].

కర్మము 3.—సంచితము, ఆగామి, ప్రారబ్ధము,

కర్మాది 3.—కర్మము, అకర్మము, వికర్మము.

కారణము 3.—ఆరంభి, పరిణామి, వివర్తము.

జీవుఁడు 3.—పారమార్థికుఁడు, వ్యావహారికుఁడు, ప్రాతిభాసికుఁడు.

జీవుఁడు 3.—విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు.

తాపములు 3.—ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము.

లక్షణదోషములు 3.—అవ్యాప్తి [లక్ష్యముయొక్క యేదేశమందు లక్షణము వర్తింపకుండుట], అతివ్యాప్తి [లక్ష్యమందు నిండి, అలక్ష్యమందును లక్షణము వర్తించుట], అసంభవము [లక్ష్యమందు లక్షణము వర్తింపకుండుట].

వాదాది 3.—గురుశిష్యులసంవాదము, జల్పము [యుక్తినిపుణపండితులకు పరస్పరవాదము], వితండము [ప్రమాణయుక్తిరహిత మయినట్టి మూర్ఖులకు పరస్పరవాదము].

## 4 చతుర్విధపదార్థములు.

అంతఃకరణము 4.—మనస్సు [సంకల్ప వికల్ప రూపవృత్తి], బుద్ధి [నిశ్చయరూపవృత్తి], చిత్తము [చింతనరూపవృత్తి], అహంకారము [అహంతారూపవృత్తి].

భక్తులు 4.—ఆర్తుఁడు [ఆధ్యాత్మికాది దుఃఖముచే వ్యాకులుఁడు], జిజ్ఞాసువు [ఆత్మజ్ఞానేచ్ఛ గలిగినవాఁడు], అర్థార్థి [విషయభోగేచ్ఛ గలిగినవాఁడు], జ్ఞాని [జీవన్ముక్తుఁడు].

చిత్తనిరోధయుక్తులు 4.—అధ్యాత్మవిద్య, సత్సంగము, వాసనాత్యాగము, ప్రాణాయామము.

పురుషార్థములు 4.—ధర్మము, అర్థము, కామము, మోక్షము.

బ్రహ్మవిదాది 4.—బ్రహ్మవిత్తుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయాంసుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

భూతగ్రామములు 4.—జరాయుజము, అండజము, ఉద్భిజ్జము, స్వేదజము.

మోక్షద్వారపాలకులు 4.—శమము, సంతోషము, వివేకము, సత్సంగము.

వర్తమానజ్ఞాన ప్రతిబంధకములు 4.—విషయాసక్తి, బుద్ధిమాంద్యము, కుతర్కము, విపర్యయదురాగ్రహము.

జ్ఞానప్రతిబంధనివృత్తిహేతువులు 4.—శమాదికము, శ్రవణము, మననము, నిదిధ్యాసనము.

సమాధివిఘ్నములు 4.—లయము, విక్షేపము, కషాయము, రసా స్వాదము.

5 పంచవిధ పదార్థములు.

అభావములు 5.—ప్రాగభావము [కార్యోత్పత్తికి పూర్వమందు], ప్రధ్వంసాభావము [నాశానంతరము], అన్యోన్యాభావము [పరస్పరమునందు], అత్యంతాభావము [త్రికాలమందు], సామయికాభావము [ఒకకాలమం దుండుట రెండవకాలమందు లే కుండుట].

ఉపప్రాణములు 5.— నాగము [ఉద్గారహేతు వైన వాయువు], కూర్మము [నిమేషోన్మేషహేతు వైన వాయువు], కృకలము [శింకాహేతు వైన వాయువు], దేవదత్తము [జృంభాహేతు వైన వాయువు], ధనంజయము [మృతశరీరపుష్టిహేతు వైన వాయువు].

కర్మములు 5.—నిత్యము, నైమిత్తికము, కామ్యము, ప్రాయశ్చిత్తము, నిషిద్ధము.

క్లేశములు 5.—అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము.

జీవన్ముక్తికి ఫలములు 5.— జ్ఞానరక్షణము, తపము, విసంవాదాభావము, దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి.

ప్రలయములు 5.— నిత్యము [క్షణక్షణమందు సర్వకార్యములకు దీపజ్యోతివలె నాశ మగుట, లేక సుషుప్తి], నైమిత్తికము [బ్రహ్మదేవుని రాత్రిరూపనిమిత్తముచే భూరాదిలోకత్రయమునకు నాశము] దినప్రలయము [బ్రహ్మదేవుని ఒకదినమునందు చతుర్దశమన్వంతరములగుచున్నవి; వానిలో ప్రత్యేకమన్వంతరమునకు నాశము. దానినే అవాంతరప్రలయ మనియు, మనుప్రలయ మనియు, నైమిత్తికప్రలయ మనియు అనుచున్నారు], మహాప్రలయము [బ్రహ్మదేవుని శతవర్షము

లైనపుడు సకలబ్రహ్మాండమునకు నాశము], ఆత్యంతికప్రలయము [బ్రహ్మాపరోక్షజ్ఞానముచే కారణసహితముగ సకల ప్రపంచమునకు బాధ మగుట].

యోగభూమికలు 5.—క్షేపము [నిరంతరముగా రాగద్వేషములచే చిత్తమునకు చంచలత], విక్షేపము [ఒకానొకప్పుడు ధ్యానయుక్తత, ఒకానొకప్పుడు అయుక్తత], మూఢము [నిద్రాలస్యాదియుక్తత], ఏకాగ్రము [ఇతరకల్పనకు వుదాస మయిన యేకాకివృత్తి], నిరోధము [బ్రహ్మాకార మయినవృత్తి].

## 6 వ ద్విధ పదార్థములు.

అనాదిపదార్థములు 6.—బ్రహ్మము, ఈశ్వరుఁడు, జీవుఁడు, అవిద్య, భేదము, సంబంధము.

పరమార్థశత్రువులు 6.—కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము.

ఈశ్వరుని ఐశ్వర్యములు 6.—యశస్సు, శ్రీ, ఔదార్యము, దయ, క్షమ, శాంతి.

సంసారసముద్రమునకు తరంగములు 6.—జన్మము, మరణము, క్షుధ, తృష, హర్షము, శోకము.

ప్రమాణములు 6.—ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి.

వేదవాక్యతాత్పర్యమునకు నిశ్చాయకలింగములు 6.—ఉపక్రమోపసంహారములకు యేకరూపత [ప్రకరణారంభమందుఁగల యర్థమే ప్రకరణాంతమందు], అభ్యాసము [వారంవారపఠనము], అపూర్వత [అలౌకికత], ఫలము [మోక్షము], అర్థవాదము [స్తుతి లేక నింద], ఉపపత్తి [అనుకూలదృష్టాంతము].

## 7 సప్తవిధ పదార్థములు.

చిదాభాసునిఅవస్థలు 7.—అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, శోకనాశము, అతిహర్షము.

చైతన్యము 7.—శుద్ధము [విశేషణరహితము], ఈశ చైతన్యము [మాయావిశిష్టము], జీవచైతన్యము [అవిద్యావిశిష్టము], ప్రమాతృచైతన్యము [అంతఃకరణావచ్ఛిన్నము], ప్రమాణచైతన్యము [ప్రమాణవృత్త్యవచ్ఛిన్నము], ప్రమేయచైతన్యము [విషయావచ్ఛిన్నము], ప్రమాచైతన్యము [విషయాకారవృత్త్యవచ్ఛిన్నము].

న్యాయమతప్రకారముగా పదార్థములు 7.—ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, సమవాయము, అభావము, విశేషము.

## 8 అష్టవిధ పదార్థములు.

పాశములు 8.—దయ, శంక, భయము, లజ్జ, నింద, కులము, శీలము, ధనము.

పురి 8.—జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, అంతఃకరణచతుష్టయము, ప్రాణపంచకము, భూతపంచకము, కామము, త్రివిధకర్మము, వాసన.

ప్రకృతి 8.—వేఱేవేఱే ఐదుభూతములు, సమష్టియైనమనస్సు, సమష్టియైనబుద్ధి, సమష్టియైన అహంకారము.

## 9 నవవిధ పదార్థములు.

సంసారము 9.—జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము, భోక్త, భోగ్యము, భోగము, కర్త, కరణము, క్రియ.

నాడికలు 9, దేవతలు 9.—ఇడ [వామనాసికాగతనాడి - దేవత హరి], పింగల [దక్షిణనాసికాగతనాడి- దేవత బ్రహ్మ], సుషుమ్న

[నాసికామధ్యగతనాడి - దేవత రుద్రుఁడు], గాంధారి [దక్షిణనేత్ర గతనాడి-దేవత ఇంద్రుఁడు], హస్తిజిహ్వ [వామనేత్రగతనాడి-దేవత వరుణుఁడు], పూష [దక్షిణకర్ణగతనాడి - దేవత ఈశ్వరుఁడు], యశ స్విని [వామకర్ణగతనాడి - దేవత బ్రహ్మ], కుహూ [గుదేంద్రియగత నాడి - దేవత పృథ్వి] అలంబుష [మేఢ్రగతనాడి-దేవత సూర్యుఁడు], శంఖిని [నాభిగతనాడి-దేవత చంద్రుఁడు].

## 10 దశవిధపదార్థములు.

రసములు 10.—శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము, రౌద్రము, శాంతము, భక్తి.

## 11 ఏకాదశవిధ పదార్థములు.

జ్ఞానసాధనములు 11.—వివేకాదులు 4, గురూపసత్తి 1, శ్రవణా దులు 4, మనోనాశము 1, వాసనాక్షయము 1.

## 12 ద్వాదశవిధపదార్థములు.

అనాత్మధర్మములు 12.—అనిత్యము, వినాశి, అశుద్ధము, అనేకము, క్షేత్రము, ఆశ్రితము, వికారి, పరప్రకాశ్యము, హేతుమంతము, పరి చ్ఛిన్నము, సంగి, ఆవృతము.

ఆత్మధర్మములు 12.—నిత్యము, అవ్యయము, శుద్ధము, ఏకము, క్షేత్రజ్ఞము, ఆశ్రయము, అవికారి, స్వప్రకాశము, హేతువు, వ్యాప కము, అసంగి, అనావృతము.

## 13 త్రయోదశవిధపదార్థములు.

భాగవతధర్మములు 13.—సకామకర్మఫలమునకు విపరీతదర్శనము, ధనగృహాదులందు తిరస్కారబుద్ధి, పరలోకమునందు నశ్వరబుద్ధి, బ్రహ్మ

నిష్ఠగురుప్రతిగమనము, గురువందు ఈశ్వరబుద్ధి మఱియు నిష్కపట సేవ, పరమేశ్వరునియందు సకలకర్మార్పణము, సాధుసంగతి, శౌచ తపస్తితిక్షామౌనములు, స్వాధ్యాయార్జవబ్రహ్మచర్యాహింసలు, సర్వత్ర ఆత్మరూపముచే ఈశదర్శనము, ఏకాంతదేశమందు ఏకాకిగానుండుట, సర్వభూతములందు ఆత్మదర్శనము ఆత్మయందు సర్వభూతముల దర్శనము, వర్ణాశ్రమాదులచే దేహమందు నిరభిమానత.

14 చతుర్దశవిధపదార్థములు.

త్రిపుటులు 14.—ఇంద్రియ దేవతావిషయ సహితములుగా పూర్వముగ చెప్పఁబడియున్నవి.

15 పంచదశవిధపదార్థములు.

మాయానామములు 15.—మాయ, అవిద్య, ప్రకృతి, శక్తి, సత్త్వ, మూల, తూల, యోని, అవ్యక్తము, అవ్యాకృతము, అజ, అజ్ఞానము, తమస్సు, తుచ్ఛ, అనిర్వచనీయము.

16 షోడశవిధపదార్థములు.

కల 16.—హిరణ్యగర్భము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజము, జలము, పృథ్వి, దశేంద్రియములు, మనస్సు, అన్నము, బలము, తపము, మంత్రము, కర్మము, లోకము, నామము.

ఇతి శ్రీవిచారచంద్రోదయే - వేదాంతపదార్థసంజ్ఞావర్ణననామికా షోడశీకలా సంపూర్ణా.



అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. 1926.